# భూ మి క

తెలుగు అకాడమి ముఖ్యకార్యక్రమాలలో ఆధునికఆంధ్రభాషకు వర్ణనాత్మక వ్యాకరణము రూపొందించడం ఒకటి. ఈ కార్యక్రమంలో తొలిఘట్టము పర్యటన పరిశోధనము; రెండో ఘట్టము జిల్లాలవారీగా పరిశోధనపట్టికల ప్రకటనము. ఈ ప్రకటనపరంపరలో తొలి ప్రచురణ 'కరీంనగర్ జిల్లా మాండలికాలు'.

జీవద్భాష మార్పు చెందుతూ ఉండటం సహజము. అయితే ఈ మార్పు కావ్యభాషలో చాలా ఆలస్యంగాను, వ్యవహారభాషలో చాలా తొందరగాను వస్తుంది. తెలుగులో క్రీ. శ. 11 వ శతాబ్దినుంచి కోకొల్లలుగా కావ్యాలు వెలసినాయి. అయినా ఈ వెయ్యి ఏండ్లలోను అందులో వచ్చిన మార్పు చాలా తక్కువ. అంతేకాదు, 19 వ శతాబ్ది వరకు వ్యాకరణమని చెప్పదగిన రచనకు ఆవశ్యకమే కలగలేదు. కాని, వ్యవహారభాషలో వచ్చిన మార్పు ఇటువంటిది కాదు. వ్యవహారభాష ప్రాచీనశాసనాలలోను, ఆయాకావ్యాలకు వ్రాయబడిన వ్యాఖ్యానాలలోను కనిపిస్తున్నది. ఈ భాష ఇంచుమించుగా పదిశతాబ్దాలపాటు వ్యవహారంలో ఉన్నా దానికి క్రీ. శ. 19 వ శతాబ్ది చివరిపాదంవరకూ గుర్తింపు రాలేదు. ఇంక గుర్తింపు రావడమే తడవుగా, ఒక శతాబ్దంలోపలనే వ్యవహారభాష మూడు పూవులూ, ఆరుకాయలుగా వర్ధిల్లి, వామనమూర్తివలె ముల్లోకాలను (కావ్య, శాస్త్ర, వ్యవహార లోకాలను) ఆక్రమించుకొంది. అంటే ఇంతవరకూ ఇంచుమించుగా వ్యవహారలోకానికి పరిమితమైన ఈ భాష ఇప్పుడు కావ్య, శాస్త్ర లోకాలను కూడా ఆక్రమించుకొన్నదన్నమాట. ఈ భాషావ్యాప్తి అపూర్వము, అపారము అయినందువల్ల, దీనిని సమగ్రంగా పరిశోధించడం ఆవశ్యకమయింది. ఇది ఏ ఒక్క వ్యక్తివల్లనో అయ్యేపనికాదు. అందుచేతనే తెలుగు అకాడమి ఈ పని చేపట్టింది.

సంస్కృతభాషామాండలికాలే కాలక్రమాన ప్రాకృతాదిభాషలుగా రూపొందినవని కొందరు విమర్శకుల అభిప్రాయము. రూపకరచనలో దేశ, పాత్ర భేదాలకు అనుగుణంగా భాషఉండవలెనని పేర్కొంటూ, నాట్యశాస్త్రంలో భరతముని చేసిన వివరణనుబట్టి కూడా ఈ అభిప్రాయము బలపడుతున్నది.[1] ఆయన వివరణమిట్లున్నది :

సంస్కృత-ప్రాకృతరూపమయిన భాషనాలుగు విధాలు-1. అతిభాష (దేవతలకుపయోగించే సంస్కృతము); 2. ఆర్యభాష (రాజులకుపయోగించే సంస్కృతము); 3. జాతిభాష (లౌకికసంస్కృతము, ప్రాకృతము); 4. యోన్యంతరీభాష (పశుపక్ష్యాదుల సాంకేతికభాషారూపమయిన సంస్కృతము). ఇంక జాతిభాషాభేదమయిన ప్రాకృతము భాషలు, విభాషలు అని రెండువిధాలు - శౌరసేని,

1. నాట్యశాస్త్రము - 17 వ అధ్యా, బరోడాముద్రణము, 26 – 64 శ్లో॥.

మాగధి, అవంతిజ (ఆవంతి), ప్రాచ్య, అర్ధమాగధి (ఆంధ్రమాగధి?), బాహ్లీక దాక్షిణాత్య [1] అనేవి ఏడు భాషలు; శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్రి, వనౌకసి అనేవి ఏడు విభాషలు

అంటే సంస్కృతాపభ్రంశాలై, ఆయా మండలాలలో సామాన్యజన వ్యవహారంలో కన్పట్టే శౌరసేన్యాది ప్రాకృతభేదాలే భాషలు. ఈ భాషాపభ్రంశాలై, వన - పర్వతసంచారుల వ్యవహారంలో ఉన్న శాకార్యాదులే విభాషలు. భరతముని రూపకరచనలో ఉపయుక్తాలయ్యే భాషా - విభాషలలో ఏడేసి భేదాలను మాత్రమే చెప్పగా[2] సింగభూపాలుడు ఆయాదేశస్థులకు ఉచితాలయిన భాషావిభాషలు ఇంకా చాలా ఉన్నవనీ, అయితే నాటకంలో వాటికి ఉపయోగం లేకపోవడంచేత లక్షణము చెప్పబడలేదని పేర్కొన్నాడు[3].

భరతముని చేసిన వివరణను పరిశీలించగా, భాషలు సంస్కృతాపభ్రంశాలనీ, విభాషలు భాషాపభ్రంశాలని స్పష్టమవుతున్నది. అయితే, ఇవి అన్నీ ఆదిలో మాండలికభేదాలే అనడం సమంజసంగా తోస్తుంది. అంటే ఒకేభాష దేశ - పాత్ర భేదాలవల్ల కాలక్రమాన ఇన్ని భాషలుగా విలసిల్లినదన్నమాట.

మరి నేటి తెలుగుభాషలోకూడా అనేక మాండలికాలున్నాయి. అనేక కారణాలవల్ల తెలుగుదేశము కొంతకాలం మూడు ప్రధానమండలాలుగా విభక్తమై ఉంది. ఈమూడు మండలాల వ్యవహారంలోను కొన్ని భేదాలు కానవస్తున్నాయి. అంతేకాదు, పలుకుబడిలో మండలానికీ మండలానికీ మాత్రమే కాక జిల్లాకు జిల్లాకు కూడా కొంత భేదము కనిపిస్తున్నది. ఇది ఇట్లా చాలాకాలం కొనసాగి ఉంటే తెలుగుభాషకూడా అనేక భాషలుగానో, విభాషలుగానో విభక్తమయి ఉండేది. అదృష్టవశాన, అట్లా జరగలేదు.

ఈ మాండలికాల పరిశోధనలవల్ల రెండు మూడు ప్రధాన ప్రయోజనాలు సిద్ధిస్తాయి -

1. తెలుగు మాండలికాలలోని ఏకత్వాన్ని నిరూపించడం.
2. ఈ ఏకత్వాన్ని వర్ణనాత్మకవ్యాకరణంగా రూపొందించడం.
3. పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్న కావ్య నాటకాలలో దేశ - పాత్రలకు అనుగుణంగా వ్యవహారభాషాప్రయోగానికి వీలుకలిగించడం.

తెలుగు అకాడమి చేసే ఈ కృషి సహృదయుల ఆదరాభిమానాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాము.

— పోణంగి శ్రీరామ అప్పారావు

డైరక్టర్, తెలుగు అకాడమి

1. ఆధునికభాషాశాస్త్రజ్ఞులు పేర్కొనే 'మూలద్రావిడభాష' ఇదేకావచ్చు.
2. కావ్య - నాటకాలలో ఉపయోగించబడేవి అష్టభాషలని అప్పకవి పేర్కొనడం ఇప్పట్ల స్మరణార్హము — అప్పకవీయము —I—83.
3. రసార్ణవ సుధాకరము — శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి అనువాదము - పుటలు 267–69.

# సంపాదకీయం

డా. బూదరాజు రాధాకృష్ణ

భాషాధ్యయనం నిన్నమొన్నటివరకూ మనదేశంలో కావ్యభాషను పరిశీలించి వ్యాకరణ గ్రంథాలు రచించటంతో ఆగిపోయ్యేది. ఏవో కొన్ని ప్రమాణాలను నిర్ణయించుకొని వాటికి అనుకూలపడ్డ భాషాలక్షణాలను సూత్రీకరించిన మన లాక్షణికులు ఆ సూత్రాలకు సరిపడని భాషను 'అలాక్షణిక'మని, 'గ్రామ్య'మని, నిరసించేవారు. లక్షణగ్రంథాలు అంగీకరించకపోయినా శిష్టవ్యవహారంలో ఉన్న భాషారూపాన్ని గౌరవించాలనే వాదం పందొమ్మిదో శతాబ్దం ఆరంభంలో తెలుగుదేశంలో వచ్చింది. ఆ కొత్తల్లో కవి ప్రయోగాలను గాలించటం, విద్యావంతుల భాషలో కావ్యభాషకు సన్నిహితంగా ఉన్న రూపాలు ఏమున్నాయో క్రోడీకరించటం, జరుగుతుండేది. కాని ప్రజాసామాన్య వ్యవహారంలో ఉన్న భాషాస్వరూపాన్ని గురించి ఎవరూ అంతగా పట్టించుకోలేదు. కావ్యభాషను సరిగా అధ్యయనం చేయనందువల్ల, ఉచ్చరించలేక పోయినందువల్ల, వ్యవహారభాష ఏర్పడిందనీ దానికొక వ్యవస్థ లేదనీ చారిత్రకంగా వ్యవహారభాష అర్వాచీనమనీ దాన్ని అధ్యయనంచేసినందువల్ల కొత్తగా వచ్చే భాషా స్వరూపస్వభావపరిజ్ఞానం ఏమీ లేదనీ విశ్వసించటమే అందుకు ప్రధాన కారణం.

ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు బహుభాషాపరిశీలన ఫలితంగా, భాషా తత్త్వ పరిశోధనద్వారా, పై అభిప్రాయాలు నిజంకావని గ్రహించారు. చారిత్రకంగా ప్రాచీనతరమైన రూపాలెన్నో వ్యవహారంలో నిలిచాయని, కావ్యభాషలో లేని అనేక విశిష్టలక్షణాలు వ్యవహారభాషలో ఉన్నాయని, అది భ్రష్టమూ గ్రామ్యమూ కాక భాషాసహజపరిణామాన్ని నిర్దేశించే రూపభేదమేనని, దానికి వ్యవస్థ లేదనటం అసందర్భమని, అప్రామాణికరూపాలు కావ్యభాషలోకూడా కనిపిస్తాయని, ప్రమాణాల నిర్ణయం సాంఘిక స్థితిగతుల మీదనే గాని లాక్షణికుల అభిరుచులమీద ఆధారపడ్డది కాదని తెలుసుకున్నారు. భాషలో - అది ఏరూపంలో ఉన్నా - దాంట్లో అంతర్గతంగా ఉన్న ఏకారణమూ దానికి అప్రామాణికత్వం తెచ్చిపెట్టదని గుర్తించారు. తత్ఫలితంగా కుల, మత, వృత్తి, ప్రాంత, భేదాల వల్ల భాషలో వచ్చే మార్పులను శాస్త్రీయంగా పరిశోధించటం ఇటీవల ఆరంభమయింది. రాష్ట్రవ్యాప్తంగా కొన్ని ముఖ్యవృత్తులవారి వర్గమాండలిక పదాలను (Class dialect words) సేకరించటం కొంతవరకు జరిగింది. అయితే, సేకరించిన పదజాలాన్నయినా పూర్తిగా పరిశీలించటం, ఫలితాలను ప్రకటించటం,

పెద్దయెత్తున జరగలేదు. ఇప్పటికి జరిగింది చాలదు. పెద్ద ఎత్తున పరిశోధన జరిపి భాషాసమష్టికి సమగ్రమైన వర్ణనాత్మకవ్యాకరణగ్రంథాలను నిర్మింప జేయగల సాధనసంపత్తిగల మహాసంస్థ తెలుగు అకాడమిని స్థాపించే దాకా ఏర్పడలేదు.

లిఖిత వాగ్రూపాల్లో ఉన్న తెలుగు భాషకు సమగ్రమైన వ్యాకరణ గ్రంథాన్ని నిర్మింపజేయటం తెలుగు అకాడమి ప్రధానలక్ష్యాల్లో ఒకటి. భిన్న సాంఘిక విద్యాస్థాయులకు చెందిన వ్యవహర్తలు భిన్నప్రాంతాల్లో ఎన్నిరకాల భాషాభేదాలను ఉపయోగిస్తున్నారో వాటన్నిటినీ అకాడమి సేకరిస్తున్నది. భాషలో ఏకత్వ వైవిధ్యాలు ఎంతగా ఉన్నాయో పరిశీలించటానికి సువిచారిత మైన ప్రశ్నావళిని రూపొందించి భాషాశాస్త్రనిపుణులు పర్యటించి విషయ సేకరణ చేశారు. ఈ సందర్భంలో అవసరమని తోచినంత వరకూ కర్చువెచ్చాలను పరిగణించక టేప్ రికార్డింగ్ కూడా చేశారు. వ్యవహర్తలు చెప్పిన మాటలనూ వాక్యాలనూ ఉచ్చారణ విధేయంగా రాసుకున్న తరవాత పరిశీలన ఆరంభ మవుతుంది.

అన్యభాషాప్రాంతాల సరిహద్దులకు దూరంగా ఆయా ప్రాంతాల నడి బొడ్డున ఉన్న నాలుగు జిల్లాల్లో ఇప్పటికి పర్యటనపరిశోధన పూర్తి అయింది. అవి కరీంనగర్, కడప, గుంటూరు, విశాఖ జిల్లాలు. ఈ పత్రికలో మొట్ట మొదట తెలంగాణా ప్రాంతమధ్యంలోని కరీంనగర్ మాండలికభాషాస్వరూపాన్ని స్థూలంగా ప్రదర్శిస్తున్నాం. తక్కిన మండలాల భాషావిషయం యథాక్రమంగా ప్రచురిత మవుతుంది. ఇందులో టేపులనుంచి తీసి ఉచ్చారణవిధేయంగా ఎత్తి రాసిన కొన్ని సంభాషణపాఠాలను, వాటిమీద లఘువ్యాఖ్యలను, ఆచార్య భద్రి రాజు కృష్ణమూర్తిగారి ప్రత్యేక వ్యాసాన్ని, ప్రశ్నావళి ఆధారంగా సేకరించిన విశేషాల్లో కొన్నింటినిగురించిన వ్యాసాన్ని, ప్రచురిస్తున్నాం. కరీంనగర్ మాండలికంలోని కొన్ని ప్రత్యేకతలను సూచనప్రాయంగా వివరించటమే ప్రస్తుత కర్తవ్యం. ఆ భాషాభేదానికి ఒక సంక్షిప్త వర్ణనాత్మకవ్యాకరణాన్ని కొద్ది మాసాల్లో ప్రకటిస్తాం.

**ఈ ప్రయత్నంలోని ప్రధానోద్దేశాలు నాలుగు :** వాటిలో మొదటిది, తెలుగుభాషలోని ప్రాంతీయ, సాంఘిక, భేదాలను సాధ్యమయినంత విపులంగా సేకరించి గ్రంథస్థం చేయటం; రెండోది, స్థానికంగా భిన్నవిధాలుగా ఉన్న భాషా ప్రమాణాలు రాష్ట్రవ్యాప్తమైన ప్రామాణికభాషగా పొందుతున్న నిరంతర పరిణామక్రమాన్ని నిరూపించటం; మూడోది, వాగ్రూపంలో ఉన్న భాషకూ లిఖితరూపంలోని భాషకూ ఎటువంటి అన్యోన్యసంబంధముందో నిర్ణయించటం; నాల్గోది, లిఖితవాగ్రూపాలు రెంటిలోనూ ఉన్న ఆధునికప్రామాణికభాషకు సమగ్రమైన వర్ణనాత్మకవ్యాకరణాన్ని ఆధునికపద్ధతుల్లో రచించటం. ఈ ఉద్దేశాల మేరకు ప్రచురిస్తున్న ఈ పత్రిక తెలుగులో భాషావిషయికంగా ఉన్న వైవిధ్యం

లోని ఏకత్వాన్ని, ప్రమాణీకరణంలో భాషాసాంఘికవ్యవస్థలకున్న పరస్పర సంబంధాన్ని, స్థూలంగా నిరూపించటంతోబాటు ఆధునికరచయితలకు పనికివచ్చే పాత్రోచిత భాషాభేదాలనుగూడా సంతరిస్తుంది.

కరీంనగర్ జిల్లాలో విషయసేకరణచేసిన పర్యటన పరిశోధకులు ముగ్గురిలో శ్రీ జె. వేంకటేశ్వరశాస్త్రిగారు ఇప్పుడు అకాడమి కొలువులో లేరు. ఈ పరిశోధన వ్యవహారానికి కావలసిన సలహాలివ్వటమేగాక ఒక వ్యాసాన్ని కూడా రాసి ఇచ్చిన ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారికి, కరీంనగర్ జిల్లా రేఖాపటం గీసిన శ్రీ పి. సి. నరసింహారెడ్డిగారికి, వ్యయప్రయాసలు లక్ష్యపెట్టక నీటుగా ముద్రించి ఇచ్చిన శ్రీ జ్యోతిప్రెస్, హైదరాబాద్, వారికి మా యీ ప్రయత్నసాఫల్యానికి తోడ్పడ్డ ఆయా వ్యవహర్తలకూ మా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పద్ధతి పరిశోధనపత్రిక లన్నింటిలోలాగానే ఇందులోనూ వ్యవహర్తల పేర్లను ఉద్దేశపూర్వకంగానే బయటపెట్టలేదు. వ్యవహారఖండికల్లోని అభిప్రాయాలతో భావాలతో అకాడమీకి ఏలాటి సంబంధమూ లేదు; వాటి బాధ్యత ఆ యా వ్యవహర్తలదే.

కేంద్రప్రభుత్వం సహాయంచేసి నెలకొల్పిన రాష్ట్రభాషాసంస్థల్లో ఇప్పటివరకూ తెలుగు అకాడమి తప్ప మరేదీ ఇంత విస్తృత ప్రణాళికతో భాషాపరిశీలన ఆరంభించలేదు. మాకున్నూ ఇది తొలిప్రయత్నం. ఇకముందు ఇతోధికసుందరంగా శాస్త్రీయంగా ఈ మహాప్రయత్నాన్ని నెరవేర్చగలమని ఆశిస్తున్నాం. భాషాభిమానులు మాకు తగినంత ప్రోత్సాహమిస్తారని విశ్వసిస్తున్నాం.

# విషయసూచిక

# 1

# కరీంనగర్ జిల్లా

ఒక ప్రాంతంలోని భాషాస్వరూపస్వభావాలు అక్కడి చారిత్రిక భౌగోళిక సాంఘికాది పరిస్థితులను ప్రతిబింబిస్తుంటాయి. ఆ పరిస్థితులుకూడా భాషను ఎంతో ప్రభావితం చేస్తాయి. అందువల్ల కరీంనగరు మాండలిక భాషస్వరూపాన్ని స్థూలంగా నిర్దేశించేటప్పుడు ఆయా విషయాలను సంగ్రహంగా నయినా చెప్పవలసివుంటుంది.

క్రీ. శ. 1905 కు పూర్వం ఈ జిల్లాను 'ఎల్గందల' జిల్లా అనేవారు. కరీంనగర్, హుజూరాబాద్, జగిత్యాల, సిరిసిల్ల, మెట్టుపల్లి, సుల్తానాబాద్, మంథని, అనే ఏడు తాలూకాలు ఈ జిల్లాలో ఉన్నాయి. 1961 జనాభా లెక్కల ప్రకారం దీని జనాభా 16,20,417. దీని వైశాల్యం 7246.936 చ. కి. మీ. (ఉత్తర అక్షాంశం 17°55′ నుంచి 19° వరకు; తూర్పు రేఖాంశం 78°30′ నుంచి 80°20′ వరకు) ఉత్తర సరిహద్దు పొడుగునా గోదావరి ప్రవహిస్తున్నది. చెప్పుకోదగ్గ నదులుగాని పర్వతపంక్తులుగాని జిల్లా మధ్యలోలేవు. రవాణా సౌకర్యాలు చాలా తక్కువ. మొత్తం రోడ్ల నిడివి 603.375 కి. మీ. మాత్రమే. రైలుమార్గం పెద్దపల్లి మినహా తక్కిన ముఖ్యనగరాలు వేటినీ తాకకుండా పోతుంది. దీని పొడుగు 60 కి. మీ. మాత్రమే. పెద్ద పరిశ్రమలుగాని పారిశ్రామిక నగరాలుగాని లేవు. పెద్ద పురపాలకసంఘాలు రెండు మాత్రమే. కరీంనగర్ (1961) - 31,491; జగిత్యాల (1961) - 20,942. అక్షరాస్యుల సంఖ్య చాలాతక్కువ - 12.58% వీరిలో పురుషులు - 20.69%; స్త్రీలు - 4.43%.

చరిత్ర ప్రసిద్ధనగరాల సంఖ్యాకూడా చాలా తక్కువ. వేములవాడ, ధర్మపురి పుణ్యక్షేత్రాలు. మంథని ప్రాచీనకాలంలో సంస్కృత విద్యాకేంద్రం. ఏడువందల సంవత్సరాలకు పూర్వకాలంనాటి శిథిలాలూ భవనాలూ లేవు. క్రీ. శ. ఎనిమిదో శతాబ్దంలో వేములవాడ నుంచి పదితరాలపాటు చాళుక్యులు పరిపాలించారు. క్రీ. శ. తొమ్మిదో శతాబ్దంలో రాష్ట్రకూటుల ఆధిపత్యాన వేములవాడ ముఖ్యపట్టణంగా ఉండేది. ఇమ్మడి అరికేసరి కాలంలో జైనమతానికి జైన మహాకవులకూ కన్నడ భాషకూ అక్కడ బహుమర్యాదలు జరిగేయి. ఆధునిక కాలంలో ఆంధ్ర మహాసభవారు నడిపిన సాంఘిక రాజకీయోద్యమాలకు సిరిసిల్ల ప్రధానకేంద్రంగా ఉండేది. ఒకప్పుడు ఈ జిల్లా కాకతీయ సామ్రాజ్యంలో

భాగంగా ఉండేది. ఆ తరువాత బహమన్లు, కుతుబ్‌షాహీల, ఢిల్లీ పాదుషాల, అసఫ్‌జాహీల, రాజ్యాల్లో భాగంగా ఉంటూ చివరకు ఆంధ్రప్రదేశ్‌లో భాగమయింది. అంటే, కాకతీయ సామ్రాజ్యం అస్తమించిన తరవాత, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడేవరకూ, రమారమి 600 సంవత్సరాలుగా తెలుగు భాషకు ప్రాముఖ్యం లేని పరిపాలనలో ఉంది.

రవాణా సౌకర్యాలు, చారిత్రక రాజకీయ ప్రాబల్యం, జనసాంద్రత, విద్యావసతులు, నగర జీవితవిధానము, పరిశ్రమసంపద, తక్కువైనందువల్ల ఈ జిల్లాలో అనేక స్థానిక మాండలికాలు వినిపిస్తాయి.

# 2

# పర్యటన పరిశోధన విధానం

వ్యావహారిక భాషకు వర్ణనాత్మక వ్యాకరణం రూపొందించే ప్రయత్నంలో తెలుగుదేశంలో శాస్త్రీయమైన పద్ధతిలో భాషా వ్యవహారభేదాల్ని సేకరించి జిల్లాల వారీగా పరిశోధన పట్టికలు ప్రకటించడం తెలుగు అకాడమి చేపట్టిన బృహత్ప్రణాళికల్లో ఒకటి. అందుకు మొదట సూత్రప్రాయమైన ప్రాథమిక విషయ సేకరణ ప్రణాళిక ఒకటి రూపొందింది. అకాడమి పర్యటన పరిశోధన విభాగంలోని పరిశోధకులు అనంతపురం జిల్లా తాడిపత్రిలో ఆ ప్రణాళిక సమగ్రత, సౌలభ్యాలను పరీక్షించారు. ఆ అనుభవంతో విషయసేకరణ ప్రణాళికలో వ్యవహర్త భాషలోని వ్యవహార భేదాల్ని ప్రణాళికా బద్ధంగా టేప్ రికార్డర్ ద్వారా రికార్డ్ చేయడానికి వీలుగా ధ్వని విభాగం అదనంగా చేరింది. వ్యవహర్తలనుంచి విడిగా వ్యవహార ఖండికలు రికార్డ్ చేయడంకూడా ఒక భాగంగా పర్యటన పరిశోధనలో చేరింది. వ్యవహారఖండికలు కథలరూపంలో, వృత్తి ఉద్యోగ వ్యాపకాల వివరాల రూపంలో, అనుభవాల రూపంలో, అభిప్రాయ ప్రకటనలరూపంలో, విషయ వివరణ రూపంలో, ఈతిబాధల రూపంలో, కబుర్ల రూపంలో, ఉపన్యాసాల రూపంలో ఉండవచ్చు.

ప్రతి జిల్లాలో తాలూకా కేంద్రాలతోబాటు ముఖ్యమైన పట్టణాలుకూడా పర్యటన పరిశోధన కేంద్రాలుగా ఎన్నికయ్యాయి. వ్యవహర్తలు సాంఘిక విద్యా సంబంధాల ఆధారంగా (వృత్తి ఉద్యోగ వ్యాపకాలనుబట్టి) కింది తరగతులుగా విభజించబడ్డారు.

***మొదటి తరగతి :*** అత్యధిక సాంఘిక విద్యాసంబంధాలుండేవారు :

1. రచయిత 2. రాజకీయ కార్యకర్త 3. బ్యాంక్ ఉద్యోగి 4. ఉపాధ్యాయులు (ఆడ, మగ; స్కూల్, కాలేజి).

***రెండో తరగతి :*** సాంఘిక, విద్యా సంబంధాల ప్రభావానికి నిత్యం లోనయ్యేవారు :

1. వ్యాపారులు (చదువుకున్న పెద్దవ్యాపారి, చదువురాని చిన్న వ్యాపారి), 2. విద్యార్థులు (బాలబాలికలు; స్కూల్, కాలేజి; పట్టణం, పల్లెలు).

***మూడో తరగతి :*** అత్యల్ప సాంఘిక విద్యా సంబంధాలుండేవారు :

1. కార్మికులు, 2. రైతులు, 3. వృత్తి పనులవాళ్లు

వ్యవహర్తల ఎన్నికలలో నివాసార్హత, కులం ప్రధానంగా పాటించబడింది. ఒక కేంద్రంలో ఎన్నుకునే పై తరగతులలోని వ్యవహర్తలు అందరూ ఆ తాలూకాలో పుట్టి పెరిగినవాళ్ళై ఉండాలి. వారి కులాలు వేర్వేరై ఉండాలి. అంటే సాధ్యమైనంత ఎక్కువగా ఆ కేంద్రంలోని ముఖ్య కులాలకు ప్రాతినిధ్యం ఉండాలి. విద్యార్థులు 15-25 ఏళ్ళలోపు వాళ్ళుగాను, యితరులు 25-50 ఏళ్ళ లోపు వాళ్ళుగాను ఉండాలి. వాళ్ళు మళ్ళీ 20 ఏళ్ళలోపు, 30 ఏళ్ళలోపు, 40 ఏళ్ళలోపు, 50 ఏళ్ళలోపు-అలా దశలవారీగా వయోభేదాలకు ప్రాతినిధ్యం వహించాలి. వీళ్ళంతా భాషా సంబంధమైన అవలక్షణాలు (నత్తి మొ॥) ఏవీ లేనివాళ్ళై ఉండాలి. వ్యవహర్తల్లో నివాసార్హతనుబట్టి (పట్టణ నివాసం, పల్లె నివాసం), కులాన్నిబట్టి, వృత్తి ఉద్యోగ వ్యాపకాల్నిబట్టి, వయస్సునుబట్టి, చదువునుబట్టి ఏర్పడే వ్యవహార భేదాల్ని పరిశీలించి స్థానిక ప్రమాణాల స్వరూపం తెలుసుకోవడం ఈ పర్యటన పరిశోధన ప్రణాళిక ముఖ్యోద్దేశం.

విషయ సేకరణ పట్టికలో వ్యవహర్త సంక్షిప్త చరిత్ర (ఊరు, వృత్తి, కులం, వయస్సు, చదువు, సాంఘిక సంబంధాలుగల వ్యక్తుల, ఊళ్ళ వివరాలు, అడ్రసు, వ్యాపకాలు, అన్యభాషా జ్ఞానం, భాషా ప్రకటన సామర్థ్యం, భాషలోని ప్రాంతీయ వ్యవహార భేదాలపైగల దృక్పథం, విషయ సేకరణకు పట్టిన కాలం) ఆ కేంద్రం తాలూకా జిల్లా వివరాలు, ప్రయాణ సౌకర్యాలు, తేది గుర్తించ బడతాయి.

విషయ సేకరణ ప్రణాళికా పట్టిక స్వరూపం కింది విధంగా ఉంటుంది.

**ధ్వని విభాగం :**

ధ్వనుల మార్పుల్ని గుర్తించడానికి కనిష్ఠ భేదకాంశాలుగల జంటపదాలు, మార్పుల్ని సూచించే ఆ యా ధ్వనులు పదాది పదమధ్య పదాంతంలోగల ఎన్నికైన పదాల పట్టిక ఉంటాయి. ఈ ధ్వని విభాగానికి అనుబంధంగా వాక్యగతంగా ధ్వనుల ఉచ్చారణ భేదాల్ని పరిశీలించడానికి ఆయా ధ్వనులు గల పదాల్ని పొందించి రూపొందించిన ఒక రచనకూడా ఉంటుంది. ఈ మొత్తం విభాగం టేప్ రికార్డర్ ద్వారా రికార్డ్ చేయబడుతుంది.

**పద విభాగం :**

ప్రత్యయాలు చేర్చినపుడేర్పడే నామ క్రియారూపాలు గుర్తించబడతాయి. ఇందులో క్రియా విభాగం పెద్దది. ఎన్నికచేసిన 20 ధాతు రూపాల్ని పరిశీలించడం జరుగుతుంది.

**సంధి విభాగం : సంధిగతమైన మార్పుల్ని సూచించే పదాలుగల వాక్యాలుంటాయి.**

ఈ భాగంకూడా రికార్డవుతుంది.

ఇవికాక ప్రాథమిక పదాల పట్టికకూడా ఉంటుంది. అందులో సంఖ్యావాచకాల పట్టిక మాత్రం రికార్డ్ చేయబడుతుంది.

ఈ ప్రణాళిక ననుసరించి 1969 లో మొట్టమొదటిసారిగా కరీంనగర్ జిల్లాలో పర్యటన పరిశోధన జరిగింది. పర్యటన పరిశోధన జరిపిన మొత్తం కేంద్రాలు పది. వ్యవహర్తలు 72 (68+4) మంది. *

వాటి వివరాలు :

| పర్యటన పరిశోధన జరిపిన ఊళ్ళు | ప్రచురణకు స్వీకరించిన వ్యవహార ఖండికలు • | పర్యటన పరిశోధకులు |
|---|---|---|
| 1. కరీంనగర్ | 2 | పి. సి. నరసింహారెడ్డి |
| 2. హుజ్ రాబాద్ | 2 | ,, |
| 3. పెద్దపల్లి | 5 | ,, |
| 4. సిర్ సిల్ల | 1 | జె. వెంకటేశ్వరశాస్త్రి |
| 5. మంథని | — | ,, |
| 6. వేములవాడ | 2 | ,, |
| 7. జగ్ త్యాల | — | ఎ. శ్రీహరి |
| 8. మెట్ పల్లి | — | ,, |
| 9. సుల్తానాబాద్ | — | ,, |
| 10. కోరుట్ల | 1 | ,, |

విషయ సేకరణ చాలావరకు స్వభాషలోనే సాగింది. విద్యావంతులైన వ్యవహర్తలతో కొంతవరకు ద్విభాషా పద్ధతి అవలంబించక తప్పలేదు. మొత్తం 68 మంది ప్రధాన వ్యవహర్తల్లో రాజకీయ కార్యకర్తలు 7 గురు, బ్యాంక్ ఉద్యోగులు 7 గురు, ఉపాధ్యాయులు 13 మంది, వ్యాపారులు 13 మంది, విద్యార్థులు 19 మంది, రైతులు ఇద్దరు, నేతపనివాళ్ళు 5 గురు, చాకలి ఒకరు, పళ్ళమ్ముకునే చిల్లర వ్యాపారి ఒకరు ఉన్నారు. వ్యవహార ఖండికలు మాత్రం రికార్డ్ చేసిన అనుబంధ వ్యవహర్తల్లో ఒక రాజకీయవేత్త, ఇద్దరు కాలేజీ విద్యార్థులు (ఒకరు రచయిత, వేరొకరు నటుడు), ఒక స్కూల్ విద్యార్థి ఉన్నారు.

ఈ వ్యవహర్తలనుంచి సేకరించిన ప్రణాళికాబద్ధమైన వ్యవహార భేదాల్ని, వ్యవహార ఖండికల్ని ఆ యా కేంద్రాలు పర్యటించిన పర్యటన పరిశోధకులే ఉచ్చారణ విధేయంగా లిపిబద్ధం చేశారు.

* వివరాలకు పటం చూడండి.

• వివరాలకు వ్యవహార ఖండికలు చూడండి.

# తెలుగు మాండలికాలు : కరీంనగరు వాడుక

భద్రిరాజు కృష్ణమూర్తి

## భాషలో వ్యవస్థ

తెలుగు సుమారు నాలుగు కోట్లమందికి మాతృభాష. తెలుగువాడెవడైనా తనకు తెలుగు రాదనుకొన్నా, తనకు వచ్చింది 'మంచి తెలుగు' కాదనుకొన్నా – ఇవి అసహజమైన అభిప్రాయాలనుకోవాలి. కొందరి తెలుగు మరి కొందరికి 'ఏస' గా ఉండవచ్చు (ఏస అంటే 'కొత్తదనం'); కాని తెలుగు కాదనిపించదు. ఈ కింది వాక్యాలు తెలుగు మాటలతో కూర్చినవైనా తెలుగు మాతృభాషగా మాట్లాడే వాళ్ళెవరూ ఆమోదించరు. ఎందుకంటే అవి 'ఏస' గా ఉండటంవల్లకాదు – తెలుగు వాడుకకు విరుద్ధంగా ఉండటంవల్ల (* = అసహజ వాక్యానికి గుర్తు).

1. * ఆయన ఊరి నుంచి వచ్చింది.
2. * ఆయన నాకు అడిగాడు.
3. * ఆయన నన్ను చెప్పాడు.
4. * పువ్వులు కడుపునిండా భోంచేస్తున్నాయి.
5. * వాడు బాగా విరిగి పోయినాడు.

ఈ వాక్యాలను సరిదిద్దమంటే తెలుగు పిల్లవాడెవడైనా సులభంగా దిద్దుతాడు. కాని, 'అవి ఎందుకు తప్పు ?' అని అడిగితే చాలామంది సరైన జవాబు చెప్పలేరు. 1వ వాక్యంలో కర్త ఆయన (పురుషవాచకం) అయినప్పుడు క్రియలో చివర *డు* గాని *రు* గాని ఉండాలి. 2వ వాక్యంలో **అడుగు** అనే క్రియతో నాకు లో ఉన్న – కు (చతుర్థి) విభక్తి సరిపడదు; నన్ను అనే ద్వితీయా విభక్తి రూపం ఉండాలి. 3వ వాక్యంలో గూడా విభక్తిదోషం ఉంది. **చెప్పు** ప్రధాన క్రియ అయినప్పుడు దానికిముందు వచ్చే నామ పదం (ద్వితీయ కర్మపదం) చతుర్థి విభక్తిలో ఉండాలి, నాకు అని. 4వ వాక్యంలో అర్థ వైరుధ్యం కనిపిస్తున్నది. 'భోంచేయటం' మనుషులు చేసేపనిగాని పూలు చేసే పనిగాదు. 5వ వాక్యంలో గూడా అటువంటి దోషమే కనిపిస్తుంది. 'విరగటం' అనేది ప్రాణులకు జరగదు; నిర్జీవమైన (స్థావరమైన) గట్టి వస్తువులకు జరుగుతుంది. కొన్ని సవరణలు చేస్తే సరైన వాక్యాలు సిద్ధిస్తాయి :

6. ఆయన ఊరునించి వచ్చాడు.
7. ఆయన నన్ను అడిగాడు
8. ఆయన నాకు చెప్పాడు.
9. పువ్వులు తోటనిండా రాలిపోయినాయి.
10. వాడు బాగా పరిగెత్తాడు.

6 - 10 వాక్యాలు వ్యాకరణయుక్తమైనవని ప్రతి తెలుగువాడు అంగీకరిస్తాడు. 1 - 5 వాక్యాలు తెలుగు వ్యాకరణానికి విరుద్ధం. తెలుగు మాట్లాడే ప్రతివాడికీ ఈ వ్యాకరణ జ్ఞానం గుప్తస్థితిలో ఉంటుంది. ఒక భాష మాట్లాడ గలగటం అంటే ఆ భాషా నిర్మాణానికి కారణమైన వ్యాకరణ జ్ఞానం కలిగి ఉండటమే. పిల్లలకు నడక వచ్చినంత సహజంగా స్వభావసిద్ధంగా భాషాజ్ఞానం గూడా అబ్బుతుంది. కాని ఈ జ్ఞానం అజ్ఞాతంగా మెదడులో ఉంటుంది. ఆలోచించే శక్తి ఉన్న ప్రతివాడికీ తన మనసు ఎలా పనిచేస్తుందో తెలియదు; అది మానసిక శాస్త్రజ్ఞుడి పని. మన శరీరంలో ఉన్న భాగాలన్నీ ఎలా పనిచేస్తున్నాయో మనకు తెలియదు; అది శారీరక శాస్త్రజ్ఞుడి పని. అలాగే భాష నుపయోగించే ప్రతివాడికీ ఆ భాషాజ్ఞానం ఏ సూత్రాలమీద ఆధారపడ్డదీ తెలియదు. ఈ సూత్రాలను పరిశోధించేది భాషాశాస్త్రం. ఊహలో ఉన్న అర్థాలకు ఉచ్చారణలో ఉన్న మాటలకు గల సంబంధం నిరూపించేదే వ్యాకరణం. ఇది వ్యవహర్త జ్ఞానగతమైనది. దీన్ని వ్యక్తీకరించి సూత్రరూపంలో చూపించేది ఆ భాషకు వ్యాకరణశాస్త్రం అవుతుంది. లిఖితరూపంలో సమగ్రమైన వ్యాకరణం ఒక భాషకు లేనంత మాత్రాన ఆ భాషకు వ్యవస్థ (వ్యాకరణం) లేదనుకోటం, సమగ్రమైన మానసిక శాస్త్రం లేనంతమాత్రాన మనస్సుకు ఆలోచనా శక్తి లేదనుకోటం లాంటిదే.

'ఆయన ఊరినుంచి వచ్చాడు' అనటానికి బదులు 'ఆడు ఊరునుంచి అచ్చిండు' అని ఎవరైనా అంటే అది అంతకు ముందు విననివాళ్ళకు 'ఏస' గా ఉంటుందిగాని వ్యాకరణ విరుద్ధమైన వాక్యంమాత్రంకాదు. మరికొందరు *అచ్చిండు* కు బదులు *వచ్చిండు* అంటారు. దాన్నే మరికొందరు *వచ్చినాడు* అంటారు. ఇవి వ్యాకరణ విరుద్ధమైన రూపాలుగావు. ప్రాంతీయంగానూ, సాంఘికంగానూ వచ్చిన తేడాలను బట్టి వాడుకలో ఏర్పడిన మార్పులు ఇక్కడ *వచ్చినాడు* లో నా హ్రస్వమై *వచ్చినడు* = *వచ్చిండు* అయింది. తెలంగాణా జానపదుల వాడుకలో పదాది వకారం లోపించి *అచ్చిండు* అయింది. కాని క్రియకూ కర్తకూ ఉన్న లింగ పురుషవచనాలలో సమానధర్మం ఉండటంలో ప్రాంతీయ భేదాలు లేవు. అంటే 'వాడు వచ్చాడు', 'వాడు వచ్చినాడు', 'వాడు వచ్చిండు', 'ఆడు అచ్చిండు' మొ॥ వాక్యాలే ఉంటాయిగాని 'వాడువచ్చింది', * 'ఆడు అచ్చింది మొ॥వి ఎక్కడా వినం. వీటిలో ఒకటి వ్యాకరణ విషయం; రెండోది ప్రాంతీయ సాంఘిక భేదాలనుబట్టి వచ్చింది. ఈ రెండూ వేరువేరు ధర్మాలు. పై చర్చనుబట్టి కొన్ని విషయాలు గ్రహించవచ్చు. (1) ప్రతిభాషకీ

వ్యవస్థ (అంటేవ్యాకరణం) ఉంటుంది. ఆ భాష మాట్లాడే ప్రతివ్యక్తికీ భాషా జ్ఞానం సహజంగా ఉంటుంది. ఈ జ్ఞానం ఉన్న ప్రతివాడూ తనభాషలో సరైన వాక్యాలనే ఉత్పత్తిచేసి ఉచ్చరిస్తాడు. వ్యాకరణవిరుద్ధమైన వాక్యాలు మాత్ర భాషలో ఎవరూ పలకరు. (2) వ్యవహారభేదాలు ఒక వ్యక్తి ప్రాంతాన్నిబట్టీ, చేసే వృత్తినిబట్టీ, చదివిన చదువునుబట్టీ ఏర్పడతాయి. ఈ మార్పులకూ వ్యాకరణానికి సంబంధం లేదు. వ్యాకరణం, వ్యాకరణజ్ఞానం ప్రాంతీయ భేదాలకు అతీతం.

## భాష - మార్పు - ప్రామాణ్యం

తెలుగు జీవద్భాష. జీవద్భాష మిగిలిన సజీవవ్యవస్థల లాగానే కాల క్రమాన మారుతుంది. భాష లేనిదే సమాజం లేదు. భాషవల్ల అన్యోన్యవ్యవహారం సాధ్యంకావటం వల్లనే సామాజికవ్యవస్థ ఏర్పడ్డది. ఒకే సమాజంలో ప్రాంతానికీ ప్రాంతానికీ, తరగతికీ తరగతికీ మధ్య తిండి, కట్టు, ఉనికి, పెళ్ళిళ్ళు, పేరంటాలు మొదలైన వాటిల్లో తేడాలున్నట్లే భాషా వ్యవహారంలోనూ తేడాలు కనిపిస్తాయి. అలవాట్లు వేరైనా తెలుగు సంస్కృతిలో ఏకరూపత కనిపిస్తుంది. వాడుకలో వినిపించే ప్రాంతీయభేదాలకూ తరగతి భేదాలకూ అతీతంగా తెలుగుభాషలో ఏకరూపత ఉంది. పిల్లలకు తల్లిదండ్రుల భాష ఒరవడి అవుతుంది. చదువులేనివాళ్ళకి చదువుకొన్నవాళ్ళ భాష ఒరవడి అవుతుంది. విజ్ఞాన ప్రసారక సాధనాలయిన వార్తా పత్రికలు, రేడియో, పుస్తకాలు మొదలైన వాటివల్ల కొందరి వాడుక మరికొందరికి ఆదర్శప్రాయం అవుతుంది. ఈ రకంగా ఏ భాషలో అయినా కొన్ని పదాలు, కొన్ని ఉచ్చారణలు సభ్యవ్యవహారానికి యోగ్యమైనవిగా మారతాయి. విద్యాభ్యాసంద్వారా ప్రమాణరూపాలను అనుకరించి నేర్చుకొని మిగిలినవాళ్ళు సభ్యత సంపాదించటానికి ప్రయత్నిస్తారు.

వాడుకలో ప్రాంతీయభేదాలు చాలారకాలైన సాంఘికచారిత్రక కారణాలవల్ల ఏర్పడతాయి. నేటి తెలుగులో నాలుగు ప్రధానమైన మాండలిక వ్యవహారాలున్నాయి. (1) కళింగమండలం (శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు) (2) రాయలసీమ (నెల్లూరు, ఒంగోలు జిల్లాలతో కలిపి) (3) తెలంగాణా (4) మిగిలిన కోస్తాజిల్లాలు (గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరులు)–ఈ విభజన చాలావరకు వృత్తిపదాల్లో ప్రతిఫలిస్తుంది. ఉదాహరణకు – వ్యవసాయ వృత్తిలో వాడే కొన్నిమాటల ప్రాంతీయ భేదాలు :

| కళింగమండలం | రాయలసీమ | తెలంగాణా | మిగిలిన కోస్తాప్రాంతం |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| —— | తువ్వనేల | దుబ్బనేల | తువ్వనేల |
| మోట | కపిల | మోట | మోట |
| మదుం | తూము | తూము | తూము |
| పూజు/పూదు | కాడిమాను/ కాడిమాకు | కాండి/కాణి/కాని | కాడి |
| నాగలి | నాగేలి/మడక | నాగలి | నాగలి |
| మేడి | మేడితోక | పాలె | మేడి |
| నక్కు | కర్రు/కారు | కర్రు | కర్రు |
| ఏటికర్ర | నొగ/నగ | ఏటికర్ర/ఏటికోల | ఏడికర్ర |
| పేడ | పేడ | పెండ | పేడ |
| ఉండ | గాను | గారె/గిర్ర/పయ్యో | చెక్రం |
| తెగులు | తెవులు | తెవులు | తెగులు |
| ఆనపకాయ | సొరకాయ | ఆనిగెంకాయ | సొరకాయ |
| గోంగూర | గోగాకు | పుండికూర/ పుంటికూర | గోంగూర |
| చోడి/చోళ్ళు | రాగి | తమిదె | తమిదె |
| గంటె/గంటి | సద్ద | సజ్జ/సద్ద | సజ్జ |
| —— (ఒక రంగు పేరు) | పసె | పయ్యో | పయ్యో |
| గాబు | కలుపు | కలుపు | కలుపు |
| ఎలుగు/కంచె | కంచె/కర | ఎలుగు/కంచె | కంచె |

పై మాండలిక విభజన స్థూలమైనది. ఇటాలిక్సులో ఉన్న మాటలు ఆయా మండలాల్లో మాత్రం వినిపిస్తున్నా మిగిలినవి రెండు మూడు మండలాలకు సామాన్యంగా ఉన్నట్టు గమనించవచ్చు. వృత్తిపదాలుగాక మిగిలిన వ్యవహారంలో ఉన్న ప్రాంతీయభేదాల స్వరూపం మనకు ఇంకా తెలియదు. ఒక్కొక్క ప్రాంతంలో సాంఘికభేదాలనుబట్టి ఎన్నో అవాంతరభేదాలు వినిపిస్తాయి. స్థూలంగా ఇప్పుడు లిఖితవాఙ్మయంలో విస్తృతంగా చలామణి అవుతున్నది 4వ మండలానికి చెందిన భాష. దీనికి కారణం ఎక్కువమంది ఆధునిక రచయితలు ఈ ప్రాంతానికి చెందినవాళ్ళు కావటం కావచ్చు. ఈ మండలం మిగిలిన వాటన్నిటితోనూ కలుస్తున్నట్టు పైమాటలనుబట్టి తెలుసుకోవచ్చు. దీనికి విలక్షణంగా ఉన్న మాటలు గూడా కొన్ని ఉండవచ్చు. మిగిలిన మండలాలకు ఇది కూడలి కావటం వల్లనే ఈ ప్రాంతవ్యవహారానికి ప్రాముఖ్యం వచ్చి ఉండవచ్చు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవాళ్ళు తయారు చేయించిన మాండలిక వృత్తిపదకోశాలవల్ల ఉచ్చారణకు, శబ్దజాలానికి సంబంధించినంతవరకు విద్యావంతులైన నాగరకుల భాషకు జానపదుల భాషకు మధ్య కొన్ని భేదాలు నియతంగా ఉన్నట్టు తెలిసింది. ఉదాహరణకు, కోస్తాజిల్లా భాషలో—

| శిష్టోచ్చారణలో | జానపదోచ్చారణలో |
|---|---|
| 1. (a) ఒత్తులు నిలుస్తాయి : భాగవతం, భారతం, ధర్మం | ఒత్తులు పోతాయి : బాగవతం, బారతం, దర్మం |
| (b) హకారం నిలుస్తుంది : హరివిల్లు, రోహిణి | హకారం పోతుంది : అరిల్లు, రోయిణి |
| 2. చకారం అంతటా నిలుస్తుంది : చవుడు, చుక్క, చొప్ప, ఊచ, పలచన | చకారం సకారం అవుతుంది (ద్విరుక్తం కానప్పుడు) : సవుడు, సుక్క, సొప్ప, ఊస, పలసన |
| 3. వి, వీ, వె, వే లు చాలా మాటల్లో నిలుస్తాయి : విల్లు, వీధి, వెండి, వేడి | వకారం పోతుంది : ఇల్లు, ఈది, ఎండి, ఏడి (ఉచ్చారణలో యిల్లు, యీది మొ.) |
| 4. సంయుక్త హల్లులు నిలుస్తాయి : హస్త, భక్తి, చేస్తాడు | సంయుక్త హల్లు ద్విత్వం అవుతుంది : అత్త, బత్తి, సేత్తాడు, మొ. |
| 5. శ, ష, స ల భేదం ఉంటుంది : శాస్త్రి, భాష, కాసు | శ, ష లు గూడా సగా మారతాయి: సేత్రి, బాస, కాసు |
| 6. పదాది *గ*కారం దేశ్య శబ్దాల్లో నిలుస్తుంది : గట్టు, గడ్డ, గండి | *గ*కారం *గె*గా మారుతుంది: గెట్టు, గెడ్డ, గెండి |

జానపదులు క్రమంగా విద్యావంతులైనప్పుడు శిష్టోచ్చారణను అనుకరిస్తారు. అసలు శిష్టోచ్చారణలో శిష్టత ఏ ధర్మాలవల్ల ప్రాప్తించిందో తెలుసుకోవచ్చు. పై ఉచ్చారణభేదాల్లో 1, 4, 5 చాలావరకు సంస్కృతం నుంచి వచ్చిన పదాలు. జానపదుల భాషలో కంటె చదువుకొన్నవాళ్ళ భాషలో సంస్కృతశబ్దాల వాడుక ఎక్కువ. పాఠ్యపుస్తకాలవల్ల, వార్తాపత్రికలవల్ల ఇది సాధ్యమవుతుంది. ఇంగ్లీషు మన దేశానికి రాకముందు చదువుకొన్న వాళ్ళంటే సంస్కృతం చదువుకొన్నవాళ్ళే. ఆనాటి నుంచి ఈనాటి వరకు సంస్కృత భాషాజ్ఞానం సమాజంలో ఒక తరగతి భేదాన్ని సృష్టించింది. అలానే ఇంగ్లీషు తెలిసినవాడు సంస్కృతాంధ్రాలు తెలిసినవాడికన్నా సంస్కారవంతుడుగా పరిగణింపబడుతున్నాడు. దీనికి కారణం ఎక్కువ భాషలు తెలిసినవాళ్ళు ఎక్కువ తరగతుల్లో కలిసిపోగలరు. ఎక్కువమందితో వ్యవహారదక్షత ఏర్పడుతుంది. అల్పవ్యవహారపరిధిగల జానపదులకు అధికవ్యవహారదక్షతగల విద్యావంతులు ఆదర్శమై వాళ్ళ భాష, కట్టు, నడవడి, ఒరవడి అవుతాయి. వాటిని అనుకరించి జానపదులు నాగరకులనించుకోటానికి ప్రయత్నిస్తారు. విద్యావిధానం, నగర

జీవితం ఈ ప్రక్రియకు ఉపకరణాలవుతాయి. ఈనాడు క్రాపు, సూటు, బూటు, పెళ్ళిళ్ళలో దండలు వేసుకోటం వగైరా రెండు సంస్కృతుల సమ్మేళనలో అన్య సంస్కృతి నుంచి దేశీయసంస్కృతిలో వచ్చిన మార్పులు. సమాజంలో వ్యక్తులకు తెలియకుండానే విలువలు మారుతుంటాయి. ఈ విలువల మార్పులో ప్రయోజన దృష్టి కొంతవరకు కనిపిస్తుంది; కాని, కారణాలు అన్నీ పూర్తిగా పరిశోధి స్తేనేగాని తెలియవు. ప్రపంచంలో అన్ని సమాజాల్లోనూ ఈ ప్రక్రియ కనిపిస్తుంది. నార్మన్ దండయాత్ర తర్వాత ఫ్రెంచి జీవితవిధానం, ఫ్రెంచి భాష బ్రిటీషు ప్రజలని, ఇంగ్లీషు భాషని ఎంతో ప్రభావితం చేశాయి. అధిక వ్యవహారదక్షత (ఎక్కువమందితో మాట్లాడగల నేర్పు) ఉన్నవాళ్ళు సంస్కార వంతులవుతారు. వాళ్ళ వాడుక మిగిలినవాళ్ళకు ప్రమాణం అవుతుంది. స్థూలంగా భాషలో ప్రామాణ్యం ఏర్పడే తీరు ఇది.

ఉచ్చారణలో లాగానే కొన్నిపదాల రూప నిష్పత్తిలో గూడా నాగర కుల భాషకు జానపదుల భాషకు భేదాలున్నాయి. ***పోతుంది, తెలియదు* (*తెలేదు, తెలీదు*)**—శిష్టుల వాడుకలో ఉంటే ***పోతది,*** *తెలవదు* మొదలైనవి ఇతరుల వాడుకలో ఉన్నాయి. నిజంగా ***పోతది,*** *తెలవదు* రూపాలకు తక్కువ విలువ కట్టటానికి ***పోతుంది, తెలియదు*** రూపాలకి ఎక్కువ విలువ కట్టటానికీ భాషాగతమైన కారణాల్లేవు. ***కురుస్తుంది : కురవదు*** రెండూ శిష్ట వ్యవహారంలో ఉన్నాయి. వాటిలాగానే ***తెలుస్తుంది : తెలవదు***గూడా తెలుగు వ్యాకరణ సూత్రాలవల్ల సాధ్యాలవుతాయి. ***కురవదు, తెరవదు*** రెంటికీ ప్రాచీన కావ్య భాషలో ***కురియదు, తెలియదు*** అనే ప్రమాణ రూపాలున్నాయి. చారిత్ర కంగా జరిగిందేమంటే ***పిలుచు : పిలవదు*** గణంలో ***కురియు : కురవదు*** శిష్టుల భాషలో చేరాయి; కాని, ***తెలియు : తెలియదు*** చేరలేదు. జానపదుల భాషలో ఇవిగూడా ఆ గణంలోనే చేరాయి. ***కలియు : కలవదు, నెరయు : నెరవదు*** ఇలాంటివన్నీ తెలుగులో అన్ని తరగతుల వ్యవహారంలోనూ ***పిలుచు*** వర్గంలో చేరిపోయినాయి. అయినప్పుడు ***తెలవదు*** ఎందుకు ప్రమాణంగాలేదు? ఇతర కారణాలవల్ల 'శిష్టత' సంపాదించిన వాళ్ళభాషలో ఈ మార్పు రాలేదు గాబట్టే ***తెలవదు*** శిష్టేతర వ్యవహారానికి ఉపలక్షకమైంది. అంటే దీన్నిబట్టి ఏది శిష్టం ఏది అశిష్టం అనే నిర్ణయం కేవలం భాషకు సంబంధించినది గాదు. ఇతర సామాజిక విషయాలనుబట్టి గూడా ఏర్పడుతుంది. కోస్తా జిల్లాల వాడుకలో 'అలా, ఇలా, ఎలా' (గోదావరి) అనే రూపాలు 'అట్లా, ఇట్లా, ఎట్లా' (గుంటూరు) అనే వాటికంటే నాజూకు అవుతున్నాయి. ***వస్తున్నది*** (గుంటూరు) కంటే ***వస్తోంది*** (గోదావరి) కి ఇప్పుడు విస్తృతి పెరిగింది. ***చేసుకొనేందుకు*** (గుంటూరు) అని ఇదివరకు రాసేవాళ్ళు ఇప్పుడు ***చేసికొందికి*** అని రాస్తున్నారు. ***ఏంది*** కంటె ***ఏమిటి*** నాజూకైన మాట. ఒక కాలంలో ప్రమాణాలైన రూపాల మధ్య పోటీ ఏర్పడి కొన్ని వాడుకలో నిలుస్తాయి. మరికొన్ని జారిపోతాయి.

ఇదే కథ తెలంగాణా వాడుకలోనూ కనిపిస్తుంది. జానపదుల ఉచ్చారణలో 'ళ' బదులు 'ల్ల' ఎక్కువగా వినిపిస్తుంది. *వాండ్లు, వాళ్ళు - అల్లు : వెళ్ళిపోయింది - ఎల్లిపోయింది ; మళ్ళీ - మల్లీ ;* శిష్టుల్లో చ కారోచ్చారణ ఇతరుల్లో స కారోచ్చారణ : *చదువు - సదువు ;* జానపదుల ఉచ్చారణలో ఒత్తులు పోతాయి : *అర్థం - అర్తం ;* వర్ణ వ్యత్యయం *ర* ల ల మధ్య అక్కడక్కడా కనిపిస్తుంది : *ఊర్లో - ఊల్రో, బర్లు - బల్రు;* శిష్టుల్లో అ, ఈ, ఏ (త్రికం) ఇతరుల్లో *గా, గీ, గే* అవుతాయి : *అప్పుడు - గప్పుడు* మొదలైనవి. ఇలానే రూప నిష్పత్తిలోనూ తేడాలు కనిపిస్తాయి. శిష్టులు చెప్పదు, చెయ్యదు అంటే జానపదులు సెప్పది, సెయ్యది అంటారు. ఈ భేదాల్లో కొన్ని, జానపదుల ఉచ్చారణలో తెలుగు దేశమంతటా కనిపిస్తాయి.

కాని, ప్రమాణ - అప్రమాణభాషా భేదాల స్వరూపం మనకింకా సమగ్రంగా తెలియదు. విద్యార్థులలో బహుముఖమైన వ్యవహారదక్షత కల్పించటం విద్యావిధానానికి లక్ష్యమైతే ప్రమాణభాషద్వారా విద్యాభ్యాసం జరగాలి. దీనికి విస్తృతమైన మౌలికపరిశోధన జరగాలి. ఏ లక్షణాలవల్ల కొన్ని వాడుకలు ఒరవడి అవుతాయి ? తెలుగు దేశంలో స్థానికంగా ఎన్ని ప్రమాణవ్యవహారాలున్నాయి ? స్థానికప్రమాణాలకూ రాష్ట్ర ప్రమాణ వ్యవహారానికీ అన్యోన్యసంబంధం ఏమిటి ? భిన్నప్రాంతాల్లో విద్యావ్యాప్తికి పనికివచ్చే మార్పులు ఏమిటి ? ఏ మార్పులు వస్తే ప్రమాణభాష అందరికీ ఆమోదయోగ్యమవుతుంది ? మొదలైన ప్రశ్నలకు కావలసిన సామగ్రికోసమే తెలుగు అకాడమీ మాండలికపరిశోధనాకార్యక్రమానికి పూనుకొన్నది. ఈ పరిశోధన ప్రయోజనాలు :

(1) తెలుగు భాషలో కులవృత్తి ప్రాంత భేదాల స్వరూపాన్ని, వాటికి అతీతమైన తెలుగు భాషా ప్రధానైక్యాన్ని పరిశీలించటం.

(2) ఏయే ఉచ్చారణలు, పదాలు ఏ ప్రాంతంలో ఏ కారణాలవల్ల ప్రమాణాలుగా స్వీకరిస్తున్నారో తెలుసుకోటం. దీనివల్ల స్థానిక ప్రమాణాల స్వరూపం తెలుస్తుంది; అసలు ప్రామాణ్యబుద్ధి ఏ ధర్మాల నాశ్రయించి ఏర్పడేదీ తెలుస్తుంది.

(3) స్థానికప్రమాణాలకు రాష్ట్రప్రమాణానికి ఉన్న సమాన రూపాలను, భేదాలనూ పరిశీలించటం.

(4) ప్రమాణభాషద్వారా రాష్ట్రం అంతటా ఆధునికవిజ్ఞాన వ్యాప్తికి తోడుపడడం. ప్రాథమిక మాధ్యమిక కళాశాలా స్థితుల్లో ఏయేప్రమాణాలు ఆధారంగా అధ్యాపకులు పాఠాలు చెప్పాలో శాస్త్రీయంగా నిర్ణయించటం.

## కరీంనగరు తెలుగు : కొన్ని విశేషాలు

పై ఆశయాలతో మొదట కరీంనగరు జిల్లాలో వేరు వేరు తరగతుల వాళ్ళ వాడుకను కొన్ని మాటల, వాక్యాల, సంభాషణల, కథల రూపంలో

సేకరించి టేపు రికార్డరుమీద రికార్డు చేయటం జరిగింది. ఈ పరిశోధన విధానాన్ని పి. సి. నరసింహారెడ్డి గారు వేరే వ్యాసంలో వివరించారు. ఈ నమూనాలను పరిశీలించిన మీదట తేలిన విశేషాలు కొన్ని :

1. వాక్య నిర్మాణంలో తెలంగాణా వాడుకకు కోస్తా జిల్లాల వాడుకకు మధ్య తేడాలేవీ కనిపించటం లేదు. ఉదాహరణకు ఈ కింది వాక్యాలు పరిశీలించండి.

(అ) తెలంగాణా : అయితే వాన్దగ్గర ఉద్దెర తీస్కుందామంటే వాడెక్కువ రాస్నడు.

కోస్తా : అయితే వాడి దగ్గర అప్పు తీసుకుందామంటే వాడెక్కువ రాస్తాడు.

(ఆ) తెలంగాణా : అక్కడ ఏదో ఒక అవసరానికి కొన్ని పైసల్ తీస్కొని పోయి ఇగ అనుకొన్న ప్రకారం చేస్కోవాలె.

కోస్తా : అక్కడ ఏదో ఒక అవసరానికి కొంత డబ్బు తీసుకుపోయి, ఇహ అనుకున్న ప్రకారం చేసుకోవాలి.

తెలంగాణా వాక్యంలో ఒక్కొక్క పదం బదులు దానికి సరియైన కోస్తా జిల్లా మాట వాడితే ఒక మాండలికం ఇంకో మాండలికం అవుతుంది. అంటే పద నిర్మాణంలోనూ, కొన్ని శబ్దాల ఉచ్చారణల్లోను తేడాలు కనిపిస్తాయి గాని వాక్యగతమైన పదాల కూర్పులో చెప్పుకోదగ్గ మార్పులేవీ లేవు. ఉర్దూ భాషా ప్రభావం వల్ల కొన్ని అన్యదేశ్యాలు - కోస్తా జిల్లాలవాళ్ళు వాడనివి - తెలంగాణా వ్యవహారంలో కనిపిస్తాయి. పోతే, నామ క్రియారూపాల్లో కొన్ని ధ్వనుల మార్పులు తెలంగాణా భాషలో ఏర్పడ్డాయి. ఈ కింది సూత్రాలవల్ల కరీంనగరు జిల్లా వాడుకలో ఉన్న రూపాలను మిగిలిన కోస్తా రాయలసీమ మండలాల భాషతో సమన్వయించవచ్చు.

2. అపదాది (అంటే పదం మొదట గాక ఇతరచోట్ల ఉన్న) దీర్ఘాచ్చులు చాలావరకు హ్రస్వాలవుతాయి; హ్రస్వాచ్చులు లోపిస్తాయి. ఈ సూత్రానికి పూర్వపరహల్లులతో సంబంధం ఉంది. వివరాలు ముందుగాని స్పష్టపడవు.

(క) అపదాది దీర్ఘాచ్చు → హ్రస్వం

(క్రియా పదాల్లో పురుష ప్రత్యయం ముందున్న అచ్చు సర్వత్రా హ్రస్వం అవుతుంది).

అంటారు → అంటరు

వస్తాడు → వస్తడు

చెప్తా(ను) → చెప్త(ను)

ఉత్తమ పురుష ప్రత్యయమైన (ను) క్రియా పదాల్లో కోస్తా జిల్లాల భాషలోనూ లోపిస్తుంది.

వచ్చాను → వచ్చా
చేశాను → చేశా, మొ.

పై సూత్రాన్నిబట్టి

చెప్పినాడు → *చెప్పినడు
చెప్పినారు → *చెప్పినరు

అయినాయి.

'న' కు పరంగా దంత్యం (త, ద) గాని, దంతమూలీయం (ర ల న) గాని, తాలవ్యం (చ, జ) గాని, మూర్ధన్యం (ట, డ) గాని వస్తే, దాని హ్రస్వాచ్చు లోపిస్తుంది. అందువల్ల

చెప్పినడు → చెప్పిండు
చెప్పినరు → చెప్పిను

అవుతాయి. అలానే *చెప్పినది→చెప్పింది; చెప్పనిది→చెప్పింది* మొదలైన రూపాలు వస్తాయి. అచ్చులు దీర్ఘంగా ఉన్న రూపాలు ఇంకా నేటి రాయల సీమ వ్యవహారంలో వినిపిస్తాయి. దీన్నిబట్టి తెలంగాణా, రాయలసీమ వాడుకలు కలిసి ఉండేవని, తెలంగాణా ప్రజల ఉచ్చారణలో పై మార్పులు వచ్చి భూత కాలిక క్రియలు ఏర్పడ్డాయని నిరూపించవచ్చు.

| **రాయలసీమ** | | **తెలంగాణా (కరీంనగరు)** |
|---|---|---|
| (వాడు) వచ్చినాడు → | *వచ్చినడు → | వచ్చిండు. |
| (వారు,మీరు) వచ్చినారు → | *వచ్చినరు → | వచ్చిను. |
| (అది) వచ్చినది → | | వచ్చింది. |
| (అవి) వచ్చినాయి → | | వచ్చినయ్. |
| (నువ్వు) వచ్చినావ్ → | | వచ్చినవ్. |
| (నేను) వచ్చినా (ను) → | | వచ్చిన. |
| (మేము) వచ్చినాం → | | వచ్చినం. |

మిగిలిన భూతకాలిక క్రియల రూపాలు గూడా ఈ సూత్రానికి సరిపడతాయి. క్రియేతరపదాల్లో గూడా దీర్ఘాచ్చు హ్రస్వం కావటం జరుగుతుంది.

దసరాకు → దసరకు.

వాక్యం మధ్యలో వచ్చే కేవల ప్రత్యయాలైన

కూడా → గుడ
కాని → కని

అని కనిపిస్తాయి.

(చ) అపదాది హ్రస్వాచ్చులు లోపిస్తాయి.

1. ద - క : ఎందుకంటే ⟶ ఎద్కంటే
2. త - ల : చేతులో ⟶ చేతుల ⟶ చేత్ల
3. ద - ల : అందులో ⟶ అంద్ల
4. ద - వ : చదవక ⟶ చద్వక
5. స - క : తీసుకుందాం ⟶ తీస్కుందాం
6. స - న : చేసిన ⟶ చేస్న
7. న - క : దానికి ⟶ దాన్కి
   కనుక ⟶ కన్క
8. న - గ : అనగదొక్కుతాంది ⟶ అన్గదొక్తాంది
9. డ - వ : నడవాలె ⟶ నడ్వాలె
10. డ - స : నడుస్తాంది ⟶ నడ్స్తాంది
11. ర-గ-స : జరుగుతనె ⟶ జర్గ్తనె

ఏయే హల్లుల మధ్య ఉన్న హ్రస్వాలు లోపిస్తాయో, వివరాలు ఇంకా స్పష్టంగా తెలియవు. వీటి లోపం ఎంతవరకు శిష్టాశిష్టేతర వ్యవహారాలను వేరుచేసేదీ గూడా ముందుగాని నిర్ణయించటానికి వీలుగాదు.

3. ద్విత్వ హల్లులు అద్విరుక్తాలవుతాయి. ఉదాహరణకు: ట్టు, క్కు మొ.

పట్టుక వచ్చి ⟶ పట్టుకచ్చి ⟶ పట్కచ్చి
తొక్కుతాంది ⟶ తొక్తాంది
ఎక్కువమంది ⟶ ఎక్వమంది

4. తెలంగాణా భాషలో జానపదుల వాడుకలో ముఖ్యంగా కనిపించే మార్పులు :

(క) *అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు* మొదలైన శబ్దాల్లో అ, ఇ, ఎ ల బదులు *గ, గి, గె* లు వినిపిస్తాయి.

అప్పుడు ⟶ గప్పుడు
అట్లా ⟶ గట్లా
అక్కడ ⟶ గక్కడ
ఈదేశం ⟶ గీ దేశం మొదలైనవి.

(చ) వ, వా, వి, వీ, వె, వే లలో మొదటి వకారం పోతుంది. (ఈ మార్పు కోస్తాజిల్లాల జానపద వ్యవహారంలో గూడా కనిపిస్తుందిగాని అక్కడ వి, వీ, వె, వే ల లోని వ కారం లోపిస్తుంది).

వచ్చిండు ⟶ అచ్చిండు
వెనకకి ⟶ ఎన్కకి
వాన ⟶ ఆన
వాళ్ళు ⟶ వాల్లు ⟶ ఆల్లు

(ట) మహాప్రాణాలు (ఒత్తులు) అల్పప్రాణా లవుతాయి (ఒత్తులు పోతాయి).

విద్యార్థులు ⟶ విద్యార్తులు
దీర్ఘం ⟶ దీర్గం
ప్రభుత్వం ⟶ ప్రబుత్వం

(త) చకారం సకారం అవుతుంది.

చదివిండు ⟶ సదివిండు
చస్తరు ⟶ సస్తరు

(ప) ళ, ళ్ళ లలో మూర్ధన్యత పోయి ల, ల్ల లు అవుతాయి.

వాళ్ళు ⟶ వాల్లు
మళ్ళీ ⟶ మల్లీ
ఒకవేళ ⟶ ఒకేల

(గ) క్ష ⟶ చ్ఛ అవుతుంది.

లక్షణం ⟶ లచ్ఛనం

పై వాటిలో (ట) (త) (ప) (గ) లు తెలుగు దేశమంతటా శిష్ట శిష్టేతరవ్యవహారాలకు సరిపడతాయి. హ్రస్వాచ్చుల లోపంవల్ల దేశ్యశబ్దాల్లో సంయుక్త వర్ణాలు తెలంగాణా వ్యవహారంలో ఎక్కువగా వినిపిస్తాయి. ఇవి కోస్తా రాయల సీమల్లో ఉండవు.

5. కరీంనగరు వ్యవహారాన్ని పరిశీలిస్తే మరో మార్పు విస్తృతంగా కనిపిస్తుంది. క్రియాపదాల్లో మొదటవచ్చే 'క చ త ప' లు 'గ జ ద బ' లుగా మారతాయి. ప, కొన్నిచోట్ల వ గా కూడా అవుతుంది.

ఎట్లాగుట్టాలె (⟵కు)
తీస్కబోయేసరికి (⟵పో)
పంజెయ్యాలె (⟵చె)
డంక గొడ్తంది (⟵కొ)
పోరాటం జేస్టందుకు (⟵చే)
మీరు జద్వకున్రి (⟵చ)
రాజు బిలిచిండు (⟵పి)
కల్లుదాగుడు (⟵తా)

ఈ సంచికలో అచ్చయిన వ్యవహారఖండికలు చదువుతుంటే ఇలాంటి ఉదాహరణలు ఎన్నో కనిపిస్తాయి. ఈ మార్పు వాక్యాదిన వచ్చే నామపదాల్లో కనిపించదు. క్రియలెప్పుడూ వాక్యమధ్యంలోనో, వాక్యాంతంలోనో వస్తాయి కాబట్టి, అచ్చుల తర్వాత వచ్చే క్రియల్లో పరుషాలు (క చ త ప లు) సరళాలు (గ జ ద బ లు) అవుతాయి అని స్థూలంగా సూత్రించవచ్చు. కోస్తా రాయల సీమ వ్యవహారాల్లో *కాని, కూడా* ⟶ *గాని, గూడా* అవటానికి ఇదే కారణం.

చెయ్యగలడు
చెయ్యబోతాడు
చెప్పదలిచాను
అమ్మజూపాడు
వెళ్ళగొట్టాను

మొదలైనచోట్ల అనుబంధ క్రియల్లో మాత్రం ఈ మార్పు కోస్తా రాయలసీమల్లో శిష్టోచ్చారణలోనూ జానపదోచ్చారణలోనూ కనిపిస్తుంది. ఇలాటి మార్పువల్లనే **ఒకటి, ఇక** మొదలైన శబ్దాలు కరీంనగరుభాషలో **ఒగటి, ఇగ** అని వినిపిస్తాయి. **గ→హ** మార్పువచ్చి కొన్ని కోస్తాప్రాంతాల్లో **ఒహటి, ఇహ, నహం, మొహం** మొదలైన ఉచ్చారణలు వినిపిస్తాయి. అంటే ప్రాచీనోచ్చారణలు ఇంకా తెలంగాణాలో నిల్చి ఉన్నాయని చెప్పవచ్చు.

6. మరొక ప్రధానమైన ధ్వనుల మార్పు తెలంగాణా (కరీంనగరు) తెలుగులో కనిపిస్తుంది. ఒక పదం చివరి దీర్ఘాచ్చు మీద వచ్చిన మరొక పదం మొదటి హ్రస్వాచ్చు తొందరగా మాట్లాడటంలో లోపిస్తుంది.

అన్నట్టా + అంటె → అన్నట్టాఽంటె
మార్పుదేవాలే + అని → మార్పుదేవాలేఽని
మంచిదయ్యా + అంటడు → మంచిదయ్యాంఽటడు
ఇస్తలే + అంటడు → ఇస్తలేంఽటడు
పిల్సకరాపో + అని → పిల్సకరాపోఽని

ముఖ్యంగా **అను** ధాతువులో **అ** లోపిస్తున్నట్టు పై ఉదాహరణలనుబట్టి గ్రహించవచ్చు. ఇలానే **ఉన్నడు, ఉంటడు** మొ. క్రియల్లో **ఉ** లోపించటంవల్లనే తెలంగాణాలో వర్తమానార్థక క్రియలు ఏర్పడుతున్నట్టు నిరూపించవచ్చు. కరీంనగరు తెలుగులో (శిష్టభాషలో గూడా) వర్తమానార్థకక్రియలకూ తద్ధర్మ భవిష్యదర్థక క్రియలకూ ఉన్న రూపభేదాలు ఈ కింది పట్టికను పరిశీలిస్తే తెలుస్తాయి.

| | వర్తమానం | తద్ధర్మం (భవిష్యత్కాలం) |
|---|---|---|
| 1. | (నేను) వస్తాన్న/వస్తన్న : | వస్త |
| 2. | (మేం) వస్తాన్నం/వస్తన్నం : | వస్తం |
| 3. | (నువ్వు) వస్తాన్నవ్/వస్తన్నవ్ : | వస్తవ్ |
| 4. | {మీరు / వాళ్ళు} వస్తాన్రు/వస్తన్రు : | వస్తరు |
| 5. | (వాడు) వస్తాండు/వస్తండు : | వస్తడు |
| 6. | (అది) వస్తాంది/వస్తంది : | వస్తది |
| 7. | (అవి) వస్తాన్నయ్/వస్తన్నయ్ : | వస్తయ్ |

తద్ధర్మ భవిష్యద్రూపాల్లో కోస్తా రాయలసీమ వ్యవహారానికి తెలంగాణా వ్యవహారానికి అట్టే తేడా లేదు : **వస్తా (ను), వస్తాం, వస్తావు, వస్తారు, వస్తాడు,**

*వస్తుంది, వస్తాయ్.* తెలంగాణా ప్రాంతంలో ఈ రూపాల చివరి పురుష ప్రత్యయంముందున్న దీర్ఘాచ్చు హ్రస్వం అవుతుంది (చూ. (2) పైన). కాని, వర్తమానక్రియల్లో తెలంగాణా (ప్రస్తుతం కరీంనగరు) వాడుకకు పూర్వ రూపాలు రాయలసీమ వ్యవహారంలో ఇంకా నిల్చి ఉన్నాయి. రాయలసీమ - కోస్తా జిల్లాల వాడుకల్లో తేడాలు ఈ విధంగా ఉంటాయి :

| **రాయలసీమ (శిష్ట భాష)** | **కోస్తా (శిష్ట భాష)** |
|---|---|
| వస్తా ఉన్నా(ను) | వస్తూ ఉన్నాను/వస్తున్నాను |
| వస్తా ఉన్నాం | వస్తున్నాం |
| వస్తా ఉన్నావ్ | వస్తున్నావ్ |
| వస్తా ఉన్నారు | వస్తున్నారు |
| వస్తా ఉన్నాడు | వస్తున్నాడు |
| వస్తా ఉన్నది | వస్తున్నది |
| వస్తా ఉన్నయ్ | వస్తున్నయ్ |

రాయలసీమ *వచ్చినాడు*, తెలంగాణాలో *వచ్చిండు* — ఈ రెంటికీ మూలరూపం *వచ్చినాడు* అని, అది స్వస్వరూపంలో ఇంకా రాయలసీమలో నిల్చిఉందనీ తెలంగాణాలో *వచ్చినడు → *వచ్చిండు*గా మారింది అనీ ఇదివరకు నిరూపించాం. వర్తమానార్థకక్రియల్లోనూ అలానే జరిగినట్టు నిరూపించవచ్చు. ముందు *ఉన్నాడు, ఉన్నారు* మొదలైన రూపాల్లో దీర్ఘాచ్చు హ్రస్వమై *ఉన్నడు, ఉన్నరు* అనే రూపాలేర్పడ్డాయి (చూ. పుట 15). ఆ తర్వాత దీర్ఘాచ్చుమీద *ఉ* లోపించింది. *వస్తా + ఉన్నడు → వస్తాన్నడు ;* మూడో మార్పు *డు, రు* ల ముందున్న న్నలో ద్విత్వం పోయింది. వస్తాన్నడు → * *వస్తానడు* (→*వస్తాండు*). పురుష ప్రత్యయం ముందున్న దీర్ఘాచ్చు వికల్పంగా హ్రస్వం కావటంవల్ల *వస్తాంది → వస్తందిగా* మారింది. రూపపరిణామం ఈ కింది విధంగా జరిగి ఉంటుంది.

(1) వస్తాఉన్నాను → వస్తాఉన్న → వస్తాన్న → వస్తన్న
(2) వస్తాఉన్నాం → వస్తాఉన్నం → వస్తాన్నం → వస్తన్నం
(3) వస్తాఉన్నావ్ → వస్తాఉన్నవ్ → వస్తాన్నవ్ → వస్తన్నవ్
(4) వస్తాఉన్నారు → వస్తాఉన్నరు → వస్తాన్నరు → *వస్తానరు
వస్తాను → వస్తను
(5) వస్తాఉన్నాడు → వస్తాఉన్నడు → వస్తాన్నడు → వస్తానడు
→ వస్తాండు → వస్తండు
(6) వస్తాఉన్నది → వస్తాన్నది → *వస్తానది → వస్తాంది → వస్తంది
(7) వస్తాఉన్నాయ్ → వస్తాఉన్నయ్ → వస్తాన్నయ్ → వస్తన్నయ్.

పై రూపాల్లో *వస్తాంది, వస్తాన్నయ్, వస్తను* లాంటివి అధ్యాపకుల భాష

లోనూ వినిపిస్తాయి. ఇవి కేవలం జానపదుల భాషకు చెందినవే అనటానికి వీల్లేదు. కోస్తాజిల్లా భాషలోగూడా కొందరి వ్యవహారంలో *వస్తాఉంది, చేస్తాఉంది* లాంటి వాడుకలు వినిపిస్తాయి.

6. కరీంనగరు వ్యవహారంలో నామక్రియావిభక్తులకు సంబంధించిన కొన్ని విశేషాలు.

**నా మ వి భ క్తు లు :**

| | కరీంనగరు | — | కోస్తా |
|---|---|---|---|
| (1) | వానిదగ్గరకు | : | వాడిదగ్గరకు |
| (2) | పండ్గ *వరకైన* కుట్టి ఇవ్వమని | : | పండగకు.../పండగ (నాటి)కి... |

(కాలార్థంలో అవధిని సూచించే ప్రత్యయం తెలంగాణాలో *వరకు*. కోస్తాజిల్లాల్లో *ఇంతవరకు, అంతవరకు* అనేచోట్ల స్థలకాలార్థాల్లో ఈ వాడుక ఉంది; ఇతరత్ర స్థలార్థకశబ్దాల్లో 'అవధి'ని సూచించటానికి ఈ ప్రత్యయం వస్తుంది. ఉదా : మా *ఇంటివరకు = మా ఇంటిదాకా*. ఇది *వరకు*, అది *వరకు* అనేవి కేవలం కాలార్థంలోనే ఉన్నాయి. కోస్తా జిల్లాల్లో - *దాకా* అనే ప్రత్యయం - *వరకు* స్థానంలో విరివిగా వాడతారు. - *నిన్నటిదాకా, ఇంటిదాకా*).

| | కరీంనగరు | | కోస్తా |
|---|---|---|---|
| (3) | అందు *కొరకు* (అప్పుడప్పుడు *కోసం* గూడా వినిపిస్తుంది) | : | అందు *కోసం* |
| (4) | నిన్నటి *సంది* (కాలార్థం)<br>ఎక్కడి *నుంచి* (స్థలార్థం)<br>(అప్పుడప్పుడు 'ఎక్కడి *నుండి*'-అని *గూడా* వినిపిస్తుంది) | | నిన్నటి *నుంచి*<br>ఎక్కడి *నుంచి* |
| (5) | సప్తమీ విభక్తి → *లో* → *లొ* → ల<br>(జానపదుల భాషలో ఎక్కువగా-ల)<br>అండ్లో, అండ్లొ, చేత్ల | | - *లో*<br><br>అందులో<br>దానిలో<br>చేతిలో |
| (6) | పట్టింపు *తోని*<br>*దాన్తోని* | | పట్టింపుతో<br>దాంతో |
| (7) | దాని వల్ల | : | దాని వల్ల |
| (8) | ఊ *ర్లోపట* | : | ఊళ్ళో |

**క్రియావిభక్తులు :**

ఇదివరకు వివరించినవిగాక ఈ కింది రూపాలు తెలంగాణా వాడుకలో వినిపిస్తాయి.

| | **తెలంగాణా (కరీంనగరు ఆధారంగా)** | : | **కోస్తా** |
|---|---|---|---|
| (1) | చెప్పది (జానపద)<br>చెప్పదు (శిష్ట) | } | చెప్పదు |
| (2) | చెప్పంగ | : | చెప్పగా |
| (3) | (మీరు) చెప్పుండ్రి | : | చెప్పండి |
| (4) | చెప్పకుంటె | : | చెప్పకపోతే |
| (5) | చెప్పుడు | : | చెప్పటం/చెప్పడం |
| (6) | చెప్పాలె | : | చెప్పాలి |
| (7) | చెప్తలేదు | : | చెప్పటంలేదు |
| (8) | చెప్పేటి/చెప్పే | : | చెప్పే, చెప్పేటి ( - **అప్పుడు** ముందు) |
| (9) | చెప్పగల్గుత | : | { చెప్పగలను<br>చెప్పగలుగుతాను |

కొన్నిచోట్ల *చేస్తిని, చెప్తిని* లాంటి రూపాలు భూతకాలంలో తెలంగాణా వాడుకలో ఉన్నాయి. వీటికీ, విరివిగా వాడే **చేసిన, చెప్పిన** లాటి రూపాలకూ మధ్య ఉన్న సంబంధం మనకు ఇంకా పూర్తిగా తెలియదు.

శబ్దజాలంలో ప్రాంతీయభేదాలు తెలుగుదేశమంతటా కనిపిస్తాయి. విషయాన్నిబట్టి వ్యవహర్త ఉచితమైన మాటలు ఏరుకొంటాడు. రాజకీయ రంగంలో మెలిగే వాళ్ళపై పత్రికల భాషాప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. సందర్భోచితంగా ఎవరు ఏమాటలు వాడతారు అనేది శైలికి సంబంధించిన వైయక్తిక విషయం. కరీంనగరు విద్యార్థి భాషలో - 'అదర్శాలు, జాతీయ భావాలు, సూచన్లు, అభిమానమైన విషయం, జాతీయ కార్యక్రమాలు, ప్రభుత్వ దృష్టి, అనర్థకం' - ఇలాంటి మాటలు వినిపించాయి. బి. ఏ. దాకా చదువు కొన్న ఒక వర్తకుని వాడుకలో ఇంగ్లీషు మాటలు ఎక్కువ కనిపించాయి. చదువు అట్టేలేని చేనేతపనివాడి వ్యవహారంలో ఎక్కువ దేశ్యశబ్దాలు దొర్లాయి. ప్రమాణాప్రమాణ భేదాలు ఉచ్చారణలోను, రూప నిష్పత్తిలోను కనిపించినంత స్పష్టంగా పదాల ఎన్నికలో కనిపించవు. కొన్ని సందర్భాల్లో మాత్రం దేశ్యశబ్దాలకంటె అన్యదేశ్యాలకు వ్యవహర్తలు ఎక్కువ విలువ కడతారు. అందువల్లనే 'చాకలి, కంసాలి, గొల్ల' మొదలైన మాటల బదులు 'రజక, విశ్వబ్రాహ్మణ, యాదవ' అనే శబ్దాలకు ప్రస్తుతం ఎక్కువ గౌరవం వచ్చింది. **సామాజికవ్యవస్థలో** వచ్చే మార్పులను ఇలాటివి ప్రతిబింబిస్తాయి.

ఇంతకుముందు శిష్టభాషా లక్షణాలకు జానపద భాషాలక్షణాలకు తేడాలు

చూపించాం. కాని జానపదవ్యవహారానికీ శిష్టవ్యవహారానికీ మధ్య ఎన్నో అంతరువులు కనిపిస్తాయి. అంటే కేవల శిష్టవ్యవహారాన్ని కేవల జానపదవ్యవహారాన్ని మినహాయిస్తే చాలామంది వాడుకలో వాళ్ళ సాంఘికస్థితి, విద్య, వృత్తి, ఇతరవ్యవహర్తలతో సంబంధం, మొ॥ వాటినిబట్టి శిష్ట జానపద వ్యవహార లక్షణాలు కలగలుపుగా కనిపిస్తాయి. ఒక వ్యక్తి మామూలు (ఇంటిదగ్గర నేర్చుకొన్న) వాడుకలో మాటలకు ఒత్తులు ఉండవలసినచోట ఒత్తులు లేకుండా ఉచ్చరించే అలవాటుందనుకోండి; అంటే మాట్లాడేటప్పుడు అతనినోటికి చప్పున అప్రయత్నంగా వచ్చే ఉచ్చారణలు 'దర్మం, బారతం, బాద' అని ఉంటాయి. అతను తనకంటె చదువుకొన్న వాళ్ళు (శిష్టులు) అని అనిపించే వాళ్ళతో మాట్లాడేటప్పుడు ప్రయత్నపూర్వకంగా ఇలాటి మాటల్లో ఒత్తులు నిలపటానికి ప్రయత్నిస్తాడు — 'ధర్మం, భారతం, బాధ' - అని. కాని ప్రయత్నపూర్వకంగా నేర్చుకొన్నవి పాత అలవాట్లు మారేదాకా పూర్తిగా సాధ్యపడవు. అందువల్ల ఆవ్యక్తి ఉచ్చారణలో కొన్ని ఒత్తులున్న మాటలు కొన్ని ఒత్తులులేనివి వినిపిస్తుంటాయి. ఒకే మాటను అలవాటుకొద్దీ ఒత్తులు లేకుండా ఉచ్చరించి సరిదిద్దుకొని ఒత్తులతో మరోసారి ఉచ్చరించటం గూడా జరుగుతుంది. ఇలాటి మార్పులను బట్టి అతను ఏ ఉచ్చారణలు, రూపాలు తన అలవాటులో ఉన్నవాటికంటె శిష్ట సమాజంలో యోగ్యమైనవిగా అనుకొంటున్నాడో మనకు తెలుస్తుంది. చాలా మంది వ్యవహారాన్ని ఇలా పరిశీలించిన మీదట వాళ్ళ వాడుక ఏరకంగా మారేది మనం తెలుసుకోవచ్చు. ఒకే మాటకు రెండు మూడు ఉచ్చారణలు ఒకే వ్యక్తిలో ఒకే కాలంలో వినిపించటం 'అవ్యవస్థ' గాదు. అతని వ్యవహారపరిణామానికి గుర్తు.

ఈ సూత్రాన్నిబట్టి కరీంనగరు భాషను పరిశీలిస్తే చాలా రకాలయిన మార్పులు నడిమి తరగతి వాళ్ళ వాడుకలో కనిపించాయి.

1. ఒక అధ్యాపకుడి భాషలో శిష్టుల వాడుకలోలాగా పదాది చ కారాలు ఎక్కువచోట్ల ఉన్నాయి. కొద్దిచోట్ల స కారాలు నిలిచి ఉన్నాయి. కాని శ మాత్రం ఎక్కువగా ల గానే వినిపిస్తుంది. వచ్చు లో కొన్నిచోట్ల వ నిలుస్తుంది; కొన్నిచోట్ల పోతుంది. ఎక్కువచోట్ల ఒత్తులు ఉండవు.

| | | |
|---|---|---|
| చేస్తేనేగాని<br>చేయగల్గుత | — | సూస్తున్న |
| ఒకవేల | — | ఒకేల |
| | — | అచ్చేసిన<br>కొన్నేల్లు |
| ఏవిధంగయిన | — | ఈవిదంగ,<br>బాదపడ్తన్న |

2. ప్రధానంగా రాజకీయాల్లో దిరిగే ఒకవ్యక్తి వ్యవహారంలో ఈ కింది మార్పులు కనిపించాయి.

చేస్కోవచ్చు, చద్వక — లేసిన్రు, ఇడ్సిపెట్టి
వచ్చెటోడు — అచ్చెటోడు, అచ్చిన్రు,
వాల్లు, వీల్లు — అస్తది
ఎవల్లు, వీల్లకు, అనెటోల్లు మొ. (శ కార రూపాలు చాలా తక్కువ)
అర్థమైతలేదు — అబిప్రాయం
— విద్యార్తులకు
— ప్రబుత్తం
— అర్తం
(ఒత్తులు చాలా తక్కువ)

3. ఒక పదిహేడేళ్ళ బ్రాహ్మణవిద్యార్థి భాషలో ఎన్నో పత్రికల్లో వచ్చె సంస్కృత శబ్దాల వాడుక ఉన్నా ఒత్తులు చాలావరకు పోయినాయి. చ/స ల మార్పు కనిపిస్తుంది. వ కారం కొన్నిచోట్ల, దాని లోపం మరికొన్ని చోట్ల కనిపిస్తుంది. సప్తమీ విభక్తిలో → ల గా మారుతుంది. ఉదా :

అభిమానమైన విషయం — జాతీయ బావాలు
అనర్థకమని — ప్రబుత్వద్రుష్టి
— ముక్యంగ
— అర్తం జేస్కోని
చాలా, చెప్పి — సదువుడు, సదువకపోవుడు

4. ఇంకో పద్దెనిమిదేళ్ళ బ్రాహ్మణ విద్యార్థి భాషలోనూ ఒత్తులు లేక పోవటం జరుగుతుంది; ళ్ళ - ల్ల ల మార్పు కనిపిస్తుంది. ఉదా :

వాన్లు, వాళ్ళు, వాల్లు
అట్టి పరిస్థితి — బాషనె
అశరాస్యులు — అచ్చెరాస్యత
ఎలాగో సాదించాం (ఇది కోస్తాజిల్లా రూపం)
దుష్టశక్తులనేటియి
అర్తం జేస్కోని
ప్రజల్లోపల — ఇండియాలవున్న
హయాంలో — పరిస్థితులల్లో

5. ఒక పద్దెనిమిదేళ్ళ హరిజన విద్యార్థి భాషలోగూడా ఒత్తులు లేక పోవటం, శ బదులు ల ఉచ్చారణ ఎక్కువగా కనిపిస్తాయి. కాని స బదులు చ, ల బదులు సప్తమీ విభక్తిలో లో అక్కడక్కడా వినిపించాయి. వ కార లోపం కొన్నిచోట్ల, వ కారం నిలపటం కొన్నిచోట్లఉంది. కొన్ని శబ్దాల్లో మామూలుగా లేనిచోట్లగూడా ఒత్తులు కనిపించాయి.

అధిఖారి, నూతా అరవై

| | | |
|---|---|---|
| వాణ్ణి | — | ఆణ్ణిమీద |
| చూడు | — | సూడు |
| చంపిండు | — | సంపిండు |
| ఊర్లో | — | ఊర్లో |
| గోతిలోకి | — | గోతిలదిగి |
| వచ్చింది | — | మందల కచ్చి (= మందలోకివచ్చి). |
| వచ్చిన | — | అస్తది |

పిల్లు, మల్ల

ఒకటి రెండు చోట్లమాత్రం *అ ఈ ఏ* ల బదులు *గా గీ గే* ల వాడుక వినిపించింది : *గి*దొక లెక్కా.

6. ముప్పయి మూడేళ్ళ చదువుకొన్న వర్తకుడి భాషలో ఆంగ్లశబ్దాలు, సంస్కృత శబ్దాలు విరివిగా ఉన్నాయి. ల్ల బదులు ళ్ళ తరుచు వినిపిస్తుంది. పదాదిన స కారం చ కారం మారుతుంటాయి. పదాది వ కారం ప్రయత్న పూర్వకంగా మాటాడినప్పుడు నిలుస్తుంది, మామూలు వాడుకలో పోతుంది. ఒత్తులు లేవు; లో → ల (సప్తమీ విభక్తి ప్రత్యయాల) మార్పుగూడా కనిపిస్తుంది.

| | | |
|---|---|---|
| వస్తరు, వీళ్ళందరు<br>వాళ్ళందరు, వాళ్ళుగుడ | } | ఎవరచ్చినా, వాల్లు,<br>వాల్లకు, సినోల్లం |
| దాన్లో | : | అమెరికాల |
| అర్థంగాదు | : | అర్తమైతది |
| | | దీర్గం దీసి, వాల్ల పచారం |

7. అట్లే విద్యావంతుడుగాని ఒక చేనేతపనివాడి వ్యవహారంలో ళ్ల → ల్ల గావటం, *అ ఈ ఏ* ల బదులు *గా గీ గే* లు రావటం తరుచుగా కనిపిస్తుంది. చ బదులు స రావటం కొన్నిచోట్ల జరుగుతుంది. లో ప్రత్యయం బదులు సర్వత్రా ల వస్తుంది. కొన్నిచోట్ల పదాది వ కారం లోపిస్తుంది.

| | | |
|---|---|---|
| ఓలకాళ్ళు<br>చిన్నోళ్ళు<br>ఆడోళ్ళు<br>మొగోళ్ళు | } | ఆల్లు<br>వాల్లు<br>ఆడోల్లు<br>ముందటోల్లు |
| అప్పుడు | : | *గ*ప్పుడు, *గి*ట్ల, *గీ*దేశం |
| | : | ఖాలం, భార్యలు |
| చేస్కుంటరు<br>చదువుకున్న | } | సదువుకుంట |
| | : | ఇంట్ల (ఇంట్లో)<br>మొగ్గంల (మగ్గంలో) |

స్థాలీపులాకంగా ప్రదర్శించిన పై ఏడుగురి వ్యవహారంలో కనిపించే మార్పులను బట్టి ఈ కింది విశేషాలు తెలుస్తాయి.

(1) అ ఈ ఏ ల బదులు *గా గీ గే* ల వాడుక కేవల జానపదవ్యవహార లక్షణం. కొద్ది సంస్కారం ఉన్నవాళ్ళు ఈ అలవాటు అంతకు ముందున్నా తొందరగా మార్చుకొంటారు. చివరి వ్యవహర్త వాడుకలోనే *గప్పుడు, గీడ, గిట్ల* (*అప్పుడు, ఇక్కడ, ఇట్ల* బదులు) లాంటి శబ్దాలు ఎక్కువగా వినవచ్చాయి.

(2) స కారం బదులు చ కారం ఉచ్చరించటం ప్రమాణ వ్యవహార లక్షణం. ఎక్కువ మందితో వ్యవహరించే అవకాశం ఉన్నవాళ్ళు క్రమంగా స బదులు చ ఉచ్చారణ నేర్చుకొనే ప్రయత్నం చేస్తారు.

(3) అంతకంటె కష్టమయింది పదాది వ కారం నిలపటం – *అచ్చిండు* బదులు *వచ్చిండు* అనటం. పదాది వకార రూపాలు శిష్టోచ్చారణలో చేరతాయి.

(4) మూర్ధన్య ళ కారానికి దంత్య ల కారానికంటె విలువ ఎక్కువ – వాళ్ళు, వీళ్ళు మొ. ఉచ్చారణలు **వాల్లు, వీల్లు** స్థానంలో సంస్కారవంతుల భాషలో ఎక్కువగా ఉంటాయి. వీటి అనుకరణ ఇంతకుముందు చెప్పినవాటి కంటె కాస్త క్లిష్టమనిపిస్తుంది.

(5) అన్నిటికంటె క్లిష్టమైంది ఒత్తులు ఉచ్చరించగలగటం. అంటే ఒత్తులు బాగా ఉచ్చరించగలిగినవాళ్ళు, అంతకుముందే ఇతరశిష్టోచ్చారణలు నేర్చుకొని ఉంటారన్నమాట. అనుకరణక్లేశంలో చివర సాధించేది ఒత్తుల ఉచ్చారణ.

పై అనుశీలననుబట్టి అధ్యాపకులు, విద్యాబోధనలో ఏయే ఉచ్చారణలు సవరించటంలో ఎక్కువ శ్రద్ధ చూపించాలో తెలుసుకోవచ్చు. ఈ పరిశోధన దేశమంతటా క్షుణ్ణంగా జరిగిన తర్వాత అధ్యాపకులకు ప్రమాణ భాషాబోధనను గురించి ప్రత్యేకంగా ఉపకారకగ్రంథాలు (guides) రాసి, 'ఓరియంటేషను కోర్సు'లు నడపటం సాధ్యమవుతుంది.

4

# కరీంనగర్ మాండలికం : కొన్ని విశేషాలు

తెలంగాణా ప్రాంతీయ మాండలికం ఇతరప్రాంత మాండలికాల కన్నా భిన్నంగా ఉన్నట్లే, ఆ ప్రాంతంలోకూడా భిన్నప్రదేశాల్లో భిన్నవిధాల భాషా రూపాలు కనిపిస్తాయి. ఈ మార్పులవల్ల ప్రాంతీయ మాండలిక ప్రభావానికి లోబడ్డ అనేక స్థానిక మాండలికాలుకూడా ఉంటాయని తెలుస్తుంది. భాషా సమష్టిలో స్థలభేద, కులభేద, వృత్తిభేదాదులనుబట్టి వైవిధ్యం ఉన్నట్లే పోలిక లున్నా ఉంటాయి. ఈపోలికలే భాషా సామాన్యలక్షణాలను సృష్టీకరిస్తాయి. ఇవే తెలుగు ఒకే ఒక భాష అనటానికి ముఖ్య నిదర్శనాలు.

భౌగోళిక దూరాలనుబట్టి భాషలో కొన్ని మార్పులు వస్తాయి. ఒక ప్రాంతంలోని భాషారూపంలో అనంతమైన సూక్ష్మభేదాలున్నా పోలికలు ఎక్కువగా ఉన్నప్పుడు అది ఒక ప్రాంతీయ మాండలికంగానే పరిగణింపబడుతుంది. ఆ ప్రాంతంలోనే చిన్న చిన్న ప్రదేశాల్లో కొద్దిపాటి మార్పులతో వ్యవహారంలో ఉన్న భాషా భేదాలను స్థానిక మాండలికా లంటారు. ప్రాంతీయ భేదంతో నిమిత్తం లేకుండా కులవృత్తి మతాదిభేదాలమీద ఆధారపడి భాషలో విభిన్నంగా కనిపించే రూప విశేషాలను వర్గమాండలికా లంటారు. కాలక్రమాన ఈ మార్పులు భాషలో సహజంగా వస్తాయి. వీటిలో ఒకటి గొప్పదనిగాని మరొకటి తక్కువదని గాని చెప్పటం సంగతంకాదు. రవాణా సదుపాయాలు, వర్తక వాణిజ్యాలు, రాకపోకలు, విద్యావినోద వసతులు ప్రచారసాధనాలు, మార్పుల సంఖ్యను తగ్గిస్తాయి. ఈ వసతులు తక్కువైనప్పుడు మార్పులు ఎక్కువగా ఉంటాయి; స్థానిక మాండలికాలు సంఖ్యాధికంగా ఉంటాయి. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, చారిత్రక ప్రాబల్యం ఉన్న ప్రాంతంలోని భాషారూపాన్ని ప్రామాణికభాషగా పరిగణిస్తాం. ప్రాంతానికి ఒక ప్రాంతీయ ప్రామాణిక భాషారూపం ఉంటుంది. దేశవ్యాప్తంగా ఏదో ఒక ప్రాంతీయప్రామాణికంగాని, విద్యావంతుల వర్గ మాండలికంగాని, లిపిలేఖనాదులద్వారా సాహిత్యోపయోగంలోకి వచ్చినప్పుడు అదే ప్రామాణిక భాషాగౌరవం పొందుతుంది.

ఒక భాషాభేదం ప్రామాణికం అనిపించుకున్నా లేకపోయినా అది కొన్ని నిర్ణీత పద్ధతుల ప్రకారం ప్రాచీనభాషనుంచి పరిణమించిన రూప విశేషమే. ప్రాంతీయభేదాదులు నియమితంగా ఉండవు; ఆ భేదాలకు కచ్చితమైన సరిహద్దులు ఉండవు. భిన్నప్రాంతాల పలుకుబడుల్లో వైవిధ్యంతోబాటు సామ్యంకూడా

ఉంటుంది. ఈ సామ్యవైషమ్యాల్లోని గుప్తనియమాలనుకూడా ఇక్కడ స్థూలంగా చర్చిద్దాం.

మా పర్యటన పరిశోధకులు కరీంనగర్ జిల్లాలోని ప్రతినిధి వ్యవహర్తల దగ్గరినుంచి సేకరించిన కొన్ని భాషా విశేషాలను ఇక్కడ చర్చిస్తాను. ప్రశ్నావళిద్వారా సేకరించిన పదజాలాన్ని మాత్రం ఇక్కడ ఉపయోగిస్తున్నాను.

కరీంనగర్ పట్టణంలో భిన్న వ్యవహర్తలు చెప్పిన 'అడుగు' ధాతు రూపాలు ఒకటో పట్టికలో ఉన్నాయి.

ఆ పట్టికలోని ఒక్కొక్క పదాన్నే పరిశీలిద్దాం.

'అడుగున్రి' అనే ప్రార్థనాద్యర్థక బహువచనరూపమే ఆ ప్రాంతంలోని ప్రామాణికరూపం అనవచ్చు. దీన్ని 'అడుగుండు/అడుగుండి' అనే కావ్యభాషా రూపంతో పోల్చిచూస్తే బహువచన ప్రత్యయం మాత్రమే వేరుగా ఉన్నట్లు తెలుస్తుంది. నకారరేఫల సంయోగంతో ఉన్న ఈ బహువచనప్రత్యయమే ప్రాచీనతరమని గుర్తించాలి. ప్రాచీన భాషలో 'న-ర' ల సంయోగం 'ణ్ఱ', ణ్ఱి), న్ద'లుగా మారినట్లు అనేక నిదర్శనా లున్నాయి. * తన్రి శబ్దభవమైన 'తండ్రి' (తణ్ఱి)), *కొన్ర శబ్దభవమైన 'కొండ' (కొణ్ఱ), * పన్రి శబ్దభవమైన 'పంది' (పన్ది) ఈ మార్పుకు నిదర్శనాలు. 'ణ్ఱ' ధ్వనికి పర్యాయోపయోగంలో ఇక్కడ వినిపించే 'న్ర' ధ్వని కావ్యభాషా రూపంకన్నా ఎంతో ప్రాచీనమయింది. ఇక్కడి వాడుకకెక్కిన మరోరూపం 'అడుగండి/అడగండి' అనేది. 'అడగండి' అనేది కోస్తాలో రాయలసీమలో బహుళ ప్రచారంలో ఉన్న రూపం. పత్రికల, సినిమాల, రేడియో ప్రసారాల, ప్రభావంవల్ల ఇది ఇక్కడి వాడుకలో ప్రవేశించి ఉంటుంది. హైస్కూల్ విద్యార్థిభాషలో ఈ రూపమే నిలిచిపోవటానికి, ప్రయాణాలు బదిలీలు కారణంగా ఉద్యోగుల భాషలో పర్యాయ రూపంగా ప్రవేశించటానికి, ఈ ప్రభావమే హేతువు. దీనికి 'అడుగుంద్రి' అనే రూపాంతరం ఒకటి స్థానిక మాండలికాల్లో కనిపిస్తుంది. దాంతోబాటే 'అడగండి' మొదలైన అన్యప్రాంతాల రూపాలుకూడా పర్యాయోపయోగంలో ఉన్నట్లూ అవి ఇతోధిక వ్యాప్తిలోకి విద్యా వ్యాపార పరిచయాలవల్ల వస్తున్నట్లూ రెండో పట్టిక నిరూపిస్తుంది.

ఆ పట్టికనుబట్టి సిరిసిల్ల, వేములవాడలు మినహా తక్కిన పట్టణాల్లో '-ండి' చివరగల రూపాలు పర్యాయోపయోగానికి వచ్చినట్లు, విద్యార్థుల్లో వ్యాపారస్థుల్లో రాజకీయకార్యకర్తల్లో ఈ రూపాలు ఎక్కువగా వాడుకలో ఉన్నట్లు, తెలుస్తుంది. '-న్రి' చివరగల రూపాలు వరంగల్ జిల్లాకు దగ్గరగా ఉన్న ప్రదేశాల్లోను, '-ంద్రి' చివరగల రూపాలు తదితర ప్రదేశాల్లోను, బహుళ వ్యాప్తిలో ఉన్నాయని చెప్పవచ్చు. విద్యావంతుల్లోను వ్యవహారదక్షతగల వర్గాల్లోను అన్యప్రాంతసాధారణమైన '-ండి' చివరగల రూపమే ఎక్కువ వాడుకలో ఉండటం గమనార్హం. ఇక్కడి వ్యవహారంలోని మరో ప్రత్యేకత 'అడుగు' ధాతుగతమైన ఉకారం అకారంగా మారకపోవటం. సిరిసిల్ల, వేముల

వాడలు '-ంఢ్రి' చివరగల స్థానికమాండలికానికి కేంద్రాలై ఉండవచ్చు. అందు వల్లనే అక్కడ ఇతరరూపాలు ఎక్కువగా వినిపించవు. అక్కడ పర్యాయోప యోగంలో ఉన్న '-న్రి' చివరగల రూపాలు ప్రాంతీయప్రామాణికభాషా రూపాలు మాత్రమే.

విధ్యర్థంలో '-ఆలె' ప్రత్యయం చేరటం ప్రాంతీయ ప్రామాణిక భాషా లక్షణం. కోస్తాలో '-ఆలి' ప్రత్యయం, రాయలసీమలో '-ఆల' ప్రత్యయం, ఈ అర్థంలో వస్తాయి.

ఒక్క రచయిత వ్యవహారంలో తప్ప తక్కినవారి వాడుకలో చేదర్థకమైన 'అడుగుతే' రూపంలోని ధాతుగతమైన ఉత్వం ఇత్వంగా మారలేదు. కావ్య భాషలో దీనికి ప్రతిరూపం 'అడిగినన్' అనేది. ఆధునిక వ్యవహారంలో ఇతర ప్రాంతాల్లోకూడా 'అడిగితే' అనే రూపమే వినిపిస్తుంది. ఈ ప్రాంత వ్యవహారం లోని రూపం కొంత ప్రత్యేకంగా ఉన్నా, కావ్య భాషా రూపానికి దూరంగాను ఆధునిక ప్రామాణికానికి సన్నిహితంగానూ ఉండటం విశేషమే. ఇక్కడ ఇంకో గమనార్హ విషయం ఉంది. కావ్యభాషలోని 'అడిగినన్' అనే ఏకరూపం నేటి వాడుకలోని 'అడిగితే, అడిగినా' అనే రెండు రూపాలకూ మూలరూపం. వాడుక లోని రెండు రూపాలకూ అర్థభేదముంది : 'అడిగితే' అనేది చేదర్థకక్రియ-'అడిగి నట్లయితే' అనేది దీనికి అర్థం; 'అడిగినా' అనేది అప్యర్థకక్రియ-'అడిగినప్పటికీ' అనేది దీనికర్థం. భిన్నార్థాలు సూచించే భిన్నరూపాలు లేని కావ్యభాషకూ ఇప్పటి వాడుకకూ ప్రయోజనంలో ఉన్న భేదాన్ని గుర్తించినప్పుడు, ఆధునిక పరిస్థితుల్లో పురాతన కావ్యభాష అంత ఉపయోగకరం కాదని గ్రహించాలి. అంతే కాదు. ఏ ప్రాంతంలోని వాడుక భాషైనా కావ్యభాషలోలేని ప్రత్యేకార్థాలను సంతరించగలదనికూడా గుర్తించాలి.

'అడిగిన.' అనేది కరీంనగర్ ప్రాంతంలోని ప్రామాణికభాషా రూపం. ఇది భూతకాలికసమాపకక్రియ. ఉత్తమపురుష ఏకవచనంలోది. లిపిలో దీనికి సన్నిహితంగా కనిపించే 'అడిగిన'కూ దీనికీ ధ్వనిసామ్యమేగాని అర్థసామ్యంలేదు. 'అడిగిన' అనేది భూతకాలిక అసమాపక క్రియ; క్రియా విశేషణంగా ఉపయోగ పడుతుంది. ఈ రెంటికీ పెద్ద భేదముంది. 'అడిగిన.' అనే రూపం ఎప్పుడూ వాక్యాంతంలో మాత్రమే వస్తుంది; రెండోది వాక్య మధ్యంలో మాత్రమే వస్తుంది. 'అడిగిన' అనే రూపం చివర ఊనిక ఉంటుంది; రెండోదానికి అదిలేదు. 'అడిగిన.' శబ్దానికి సరైన పూర్వ రూపం 'అడిగినాను'; ఇది రాయలసీమ వాడు కలో యథాతథంగా ఉంది. కోస్తా వాడుకలో దీనికి సరైనరూపం 'అడిగ్గే(ను).' కావ్యభాషారూపంలోని కాలబోధక ప్రత్యయమైన '-(ఇ)నా' లోని నకారలోపం వల్ల (-ఇ-ఆ⟶ఏ) కోస్తా రూపం ఏర్పడగా, తుది దీర్ఘం హ్రస్వమైనందువల్ల (-ఇ-న్-అ) తెలంగాణా రూపం ఏర్పడింది. కావ్యవ్యవహారంలోని [illegible]రి '-ను' పురుషబోధకప్రత్యయం. ఈ ప్రత్యయం [illegible]

వాడుకలోనే కాక ఇతర ద్రవిడభాషల వారి వాడుకలో కూడా వినిపించే సాధారణ లక్షణం.

తద్ధర్మార్థక విశేషణమైన 'అడిగే(టి)' అనే రూపం ఆంధ్రప్రదేశమంతటా వాడుకలో వినిపించేదే. కావ్యభాషలో దీని సమానార్థకరూపం 'అడిగెడు/అడిగెడి'. క్రీ. శ. పదకొండో శతాబ్దంనుంచీ నేటి వాడుకలో ఉన్న రూపాలకు ప్రయోగాలు దొరుకుతున్నాయి. కావ్యభాషకూ వాడుకభాషకూ కాలక్రమాన ఎంత భేదం వచ్చిందో ఇట్లాంటి శబ్దాలు నిరూపిస్తాయి.

'అడుగుడు' అనే భావార్థక విశేషణం ఈ ప్రాంత ప్రామాణికరూపం. (కావ్యభాషలో ఇదేరూపం ఆనంతర్యార్థకంగా ఉంటుంది). దీనికి సరైన కావ్యభాషారూపం 'అడుగుట' కోస్తాలోని 'అడగడం, అడగటం' (ఉత్తరకోస్తాలో '-డం' చివరగల రూపాలూ దక్షిణకోస్తాలో '-టం' చివరగల రూపాలూ వినిపిస్తాయి) అనేవి, రాయలసీమలోని 'అడగడం' అనేది, దీనికి సమానమైన రూపాలు. 'పెంపుడు చిలక, దంపుడు బియ్యం' వంటి మాటల్లో ఈ డు ప్రత్యయం అన్య ప్రాంతాల వాడుకలోకూడా వినిపిస్తుంది. కాకపోతే ఈ ప్రాంతంలో ఈ ప్రత్యయానికి వాడుక ఎక్కువన్నమాట.

'అడగకు/అడుగకు' అనే వ్యతిరేకార్థక క్రియారూపానికి కావ్యభాషలోని సమానరూపం 'అడుగకుము' అనేది. ఇది మధ్యమపురుష ఏకవచనరూపం. ఇక్కడ కూడా పురుషబోధకమైన ము ప్రత్యయం వాడుకలో లోపిస్తున్నది. పద మధ్యసంధి జరిగిన 'అడక్కు' (<అడగ+కు) అనే రూపం కోస్తాలోను, 'అడగవద్దు/అడగొద్దు' అనే పర్యాయశబ్దం రాయలసీమలోను, వినిపిస్తున్నాయి.

'అడుగుతున్న.' అనేది. వర్తమానకాలిక సమాపక క్రియారూపం; ఉత్తమ పురుష ఏకవచనశబ్దం. 'అడిగిన.' లో లాగానే ఇందులో కూడా పదాంతంలోని పురుషప్రత్యయం (-ను) లోపించింది. కోస్తారాయలసీమలలో ను లోపం తరవాత పదాంతదీర్ఘం యథాతథంగా ఉండగా ('అడిగే-'కోస్తా; 'అడిగినా'-రాయలసీమ), ఈ ప్రాంతంలో అది హ్రస్వమై ఊనికతో వాక్యాంతంలో ప్రయుక్తమవుతున్నది. ప్రత్యయగతమైన ఉత్వం అత్వంగా మారటం ఈ ప్రాంతంలో కొందరు విద్యావంతుల భాషలో వినిపిస్తుంది. మరికొందరి భాషలో పురుషబోధక ప్రత్యయం అచ్చుతో కలిసిగాని (అడుగుతున్నా-ను), అచ్చు లేకుండా గాని (అడుగుతున్నా-న్) నిలిచింది.

క్త్వార్థకమైన -ఇ ప్రత్యయం చేరిన 'అడిగి' అనే రూపం ఆంధ్రప్రదేశ్ అంతటా ఒకే విధంగా ఉంది.

వ్యతిరేకార్థకక్రియ ఉత్తమపురుషైకవచనరూపం కూడా పురుషబోధక ప్రత్యయరహితంగా రాష్ట్రమంతటా ఒకే విధంగా ('అడగ/అడుగ') వాడుకలో ఉంది. అయితే ధాతుమధ్యాచ్చు అత్వంగా మారకపోవటం మాత్రం తెలంగాణా భాషలోని ప్రత్యేకలక్షణమే. అజాకర్షణ (vowel harmony) అని పూర్వులూ అజ్వర్ణసమీకరణం (vowel assimilation) అని నవ్యులూ పేర్కొనే తెలుగు

భాషా సాధారణ లక్షణం ఈ ప్రాంతంలో వర్తించదని చెప్పాలి. ఇదే లక్షణం వ్యతిరేకార్థక క్రియా విశేషణమైన 'అడుగని' విషయంలో కూడా అను వర్తిస్తుంది.

'అడుగుతం; అడుగుదాం' అనే క్రియారూపాలు రెండూ రెండు రకాలవి. మొదటిది భవిష్యదర్థకసమాపక క్రియ; బహువచనంలో ఉంది. రెండోది ఉభయప్రార్థనార్థక క్రియ; నిత్యబహువచనంలో ఉంటుంది. మొదటిదాని కావ్య భాషా రూపం 'అడుగుదుము/అడిగెదము'; రెండోదాని కావ్యభాషారూపం 'అడుగుదుము'. కోస్తాలో రాయలసీమలో ఈ రెంటికి సమానంగా 'అడుగుతాం: ఆడుగుదాం' అనే రూపాలున్నాయి. భిన్నక్రియల్లో ప్రత్యయ స్వరూపం కొంత భిన్నంగా ఉంటుంది. 'చేయు, పరిశీలించు' ధాతువులకు కోస్తాలో 'చేస్తాం; చేద్దాం', 'పరిశీలిస్తాం; పరిశీలిద్దాం' అనే రూపభేదాలున్నాయి. తెలంగాణాలో వీటికే 'చేస్తం; చేస్తాం', 'పరిశీలిస్తం; పరిశీలిస్తాం' అనే పర్యాయరూపాలున్నాయి. అంటే, కోస్తా భాషలో ఈ రెండు రకాల క్రియారూపాలనూ వివరించటానికి '-తాం; -దాం' అనే రెండు భిన్నప్రత్యయాలున్నాయన్నమాట; శ్వాసత నాదతలవల్ల అర్థభేదం సూచితమవుతుంది. రాయలసీమలోనూ ఇదేవిధానమైనా ఉభయప్రార్థనంలో '-దాం/-ంతాం' అనే పర్యాయరూపత కనిపిస్తుంది. ఇదే అర్థభేదాన్ని తెలంగాణాలో అచ్చుల హ్రస్వదీర్ఘ భేదం ద్వారా సాధిస్తున్నారు. ఈ ప్రాంతంలో ఎవరి వాడుకలో నయినా '-దాం' చివర గల రూపాలు వినిపిస్తే అది ఇతర ప్రాంతప్రభావంవల్లనని భావించవచ్చు. 'అడుగుదాని, అడుగుదామి, అడుగుదారి' లాంటి రూపాలు గోదావరి జిల్లాల్లో ముఖ్యంగా కొన్ని వర్గమాండలికాల్లో (class dialects) వినిపిస్తుంటాయి. అవే రూపాలు ఇక్కడ గూడా కదాచిత్తుగా వాడుకలో ఉండటం, చిన్నచిన్న మార్పు లెన్ని ఉన్నా భాష అంతా ఒకటే ననటానికి పెద్ద నిదర్శనం.

* * *

ఇంతవరకూ ఒకే పట్టణంలో వేర్వేరు తరగతులకు చెందిన వ్యవహర్తల వాడుకలోని కొన్ని ప్రత్యేక లక్షణాలను ముఖ్యంగా పరిశీలించాం. ఇది భౌగోళిక దూరాలవల్ల భాషలో కనిపించే మార్పులను తెలుసుకోటానికి తోడ్పడదు. భిన్న పట్టణాల్లోని ఒకే తరగతికి చెందిన వ్యవహర్తల భాషావిశేషం తరగతి భేదాలను బట్టి భాషలో వచ్చే మార్పులను సూచించదు గాని ప్రాంతీయ భేదాలు భాషలో తెచ్చే మార్పులను సూచిస్తుంది. తెలంగాణా ప్రాంతంలో ఒక భాగమయిన కరీంనగర్ జిల్లాలోనే భిన్నప్రదేశాల్లో నివసించే ప్రజలు భిన్నవిధాలుగా మాట్లాడుతుంటారనటానికి మూడో పట్టికలోని నేత పనివాళ్ళ భాషారూపాలు, తరవాతి పట్టికలోని విద్యార్థుల భాషారూపాలు, నిదర్శనమిస్తాయి. నేతపనివాళ్ళభాష (పట్టిక 3) అవిద్యావంతుల వాడుకకూ, విద్యార్థుల భాష (పట్టిక 4) చదువుకుంటున్న వాళ్ళభాషకూ నమూనాలు.

నేతపనివాళ్ళ భాషలో కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపిస్తాయి. 'నీరు, కాలు' శబ్దాల బహువచన రూపాలు మెట్టుపల్లి, సుల్తానాబాదుల్లో దంతమూలీయోచ్చారణతో వినిపిస్తాయి. ఇతరత్రా దంత్యోచ్చారణమే ఉంది. కోరుట్లలో ఒక్కరి వాడుకలో మాత్రం మూర్ధన్యోచ్చారణ ముంది. ఈ రకం పలుకుబడి కోస్తాలోని విద్యావంతుల భాషలోనే వినిపిస్తుంది. ఈ వ్యక్తి విషయంలోనైనా 'నీల్లు, వాకిల్లు, ముల్లు' లాంటి మాటల్లో ప్రాంతీయతాచిహ్నమైన దంత్యోచ్చారణ లేకపోలేదు. ఈ పద్ధతే కోస్తాలోని అవిద్యావంతులభాషలోను, రాయలసీమలో సర్వసాధారణంగాను ఉంది.

తాలవ్యమైన యకారం పరంగా ఉన్నప్పుడు దాని ప్రభావంవల్ల పదమధ్యంలోని త, ద లు తాలవ్యీకరణంపొంది చ, జ, లుగా మారటం కోస్తా భాషలో సర్వసామాన్యమైనా ఇతర ప్రాంతాల్లో చాలా అరుదు. 'పజ్యాలు, ముచ్చెం' లాంటి రూపాలు బహుశా రేడియో సినిమాల ప్రభావంవల్ల ఇక్కడకూడా వాడకలోకి వచ్చిఉంటాయి. ఈ మార్పు రానేరానిచోటు సిర్సిల్ల; ఇది ఒకానొక ప్రత్యేక స్థానిక మాండలికానికి కేంద్రమై ఉంటుంది. 'ముచ్చెం' లాంటి రూపాల విషయం విలక్షణమయింది. పదాంతంలోని తాలవ్య ఎకార ప్రభావంవల్ల 'ముత్తెం' లోని ద్విరుక్త తకారం ద్విరుక్త చకారంగా మారింది.

'వాకిల్లు, ముల్లు' శబ్దాల విషయంలో ఇతర ప్రాంతాల అవిద్యావంతుల ఉచ్చారణకూ దీనికీ భేదంలేదు. 'పండ్లు' అనే రూపం రాయసీమలోకూడా వినిపిస్తుంది. కోస్తాలో 'పళ్లు, పండ్లు' అనే రెండు రూపాలున్నాయి. 'బండ్లు' విషయంకూడా అంతే. అయితే కరీంనగర్, సిరిసిల్ల పట్టణాల్లో బహువచన ప్రత్యయానికి ముందున్న నకారం దంత్యంగా కాక దంతమూలీయంగా ఉచ్చరితం కావటం విశేషమే. ఇది స్థానిక మాండలిక లక్షణమని గుర్తించాలి.

'ఏరాలు' శబ్దం విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో మాత్రమే వినిపిస్తుంది. ఇతర ప్రాంతాల్లో 'తోడికోడలు' శబ్దమే పర్యాయోపయోగంలో ఉంది. బహువచనంలో మెట్టుపల్లిలోతప్ప తక్కిన ప్రదేశాల్లో 'ఏరాన్లు' అనిఉండగా, ఆ ఒక్క చోట 'ఆరాండ్లు' అనే రూపం వాడుకలో ఉంది. 'పల్లు-పండ్లు' అన్నచోట లాగా ఇక్కడకూడా బహువచన రూపం ఏర్పడింది.

'పలిగింది, తలిగింది' శబ్దాల్లోని గకార లకారాల స్థానవ్యత్యయం కరీంనగర్ భాషాప్రత్యేకతల్లో ఒకటి. ఇతర ప్రాంతాల్లోనూ కావ్యభాషలోనూ ఈతీరు వర్ణవ్యత్యయం అసలు లేకపోలేదు. ఉదా॥ వాడుకలో : గాలం/లాగం, రోగం/గోరం; కావ్యభాషలో : పారువము/పావురము. కాని ఈ మార్పు వీటిలో బహు విరళం.

చదువుకోనివాళ్ళ భాషలో రాష్ట్రం మొత్తంమీద పదాది సంయుక్త ధ్వనులు ఏదో ఒకధ్వని కోల్పోవటం సహజ పరిణామమే. 'వ్యాపార' శబ్దంలోని పదాది యకారం కోరుట్లలోను, పదాది వకారం సిర్సిల్ల సుల్తానాబాదుల్లోను, లోపించింది. ఈ అర్థంలో మెట్టుపల్లి కరీంనగర్లలో ఈ శబ్దం వాడుకలోలేదు;

'వ్యవహార' శబ్ద రూపాంతరమైన 'యవ్వారం' మాత్రమే అర్థభేదంలో నిలిచింది. 'వ్యవహారం' పామరభాషలో అన్నిచోట్లా 'యవ్వారం' గానే మారుతున్నది.

ఈ పట్టికవల్లకాక ఇతరాధారవల్ల ఈ ప్రాంతంలో ఉర్దూలోని 'వహీ/బహీ' శబ్దభవమైన 'వయి' ఎక్కువ వాడుకలో ఉన్నట్లు తెలుస్తుంది. అయితే 'పుస్తక' శబ్దాన్ని ఉచ్చరించమన్నప్పుడు వ్యవహర్తలు పదమధ్యంలోని సంయుక్తహల్లుల్లో దేన్నో ఒకదాన్ని లోపింపజేశారు. 'పుస్కం' అనేచోట తకారం లోపించటం రాష్ట్ర వ్యాప్తంగా పామరభాషలో వినిపిస్తుంది.

చదువుకోనివాళ్ళ భాషలో శ, ష, స, ల మారుపాటు రాష్ట్రమంతటా సర్వసాధారణంగా వినిపిస్తుంది. 'సుక్రారం', 'యేశం' లాంటి ఉచ్చారణ రాష్ట్ర వ్యాప్తమే అయితే ఒక చిన్న మార్పు కనిపిస్తుంది. కోస్తా రాయలసీమల్లో శకారం సకారంలో కలిసిపోతుంటే తెలంగాణాలో అది షకారంతో కలిసి పోతున్నది.

ప్రార్థనార్థక మధ్యమపురుష బహువచనమైన 'పిలువుండ్రి' అనే రూపమే ప్రాంతీయ మాండలిక రూపం. 'పిలుండ్రి', 'పిల్చుండ్రి' అనే రెండు రూపాలూ స్థానిక మాండలికాలు. ప్రాతిపదికలో *పిలు- వరకే మిగిలిన 'పిలుండ్రి' అతి ప్రాచీన రూపం. అజాదిప్రత్యయాలముందు ధాతుగతమైన చకారం వకారంగా మారటం కావ్యభాషలోనూ కోస్తా తెలంగాణా భాషా రూపాల్లోనూ సర్వసాధారణమే. కానీ రాయలసీమలో 'పిలచాల' మొదలైన రూపాల్లో ధాతుగతమైన చకారం మారకపోవటం కద్దు. ఈ లక్షణమే ఇక్కడా కనిపిస్తుంది.

భావార్థంలో ధాతువుమీద -డు ప్రత్యయం చేరటం తెలంగాణాలో సామాన్య లక్షణం; ఉత్తర కోస్తాలోను రాయలసీమలోను '-డం' చేరగా దక్షిణ కోస్తాలో '-టం' చేరుతుంటుంది. అలాగే '-టం' చేరటం సిర్‌సిల్ల, కరీంనగర్, సుల్తానాబాదుల్లో కనిపిస్తుంది. కోస్తాలోనూ ఇతరత్రా కూడా ధాతుమధ్యాచ్చు అత్తుగా మారుతుంది; ఇక్కడ మారదు. అంతే భేదం.

సంఖ్యావాచకమైన 'ఏడు' శబ్దం కోరుట్లలో 'యోడు' గా నిలిచింది. వస్త్రకారుల భాషలోనేగాక అనేక ఇతర వృత్తులవారి భాషలో కూడా ఈ పదాది ఒకారోచ్చారణ వినిపిస్తున్నది. ఏ/ఓ-ల మారుపాటుకు ద్రవిడభాషల్లో అనేక నిదర్శనాలున్నాయి. 'పదహారు' అనే రూపం రాష్ట్రవ్యాప్తంగా ఒకే రకంగా వినిపిస్తుంది. 'పదారు' ఒక్కటే కావ్యభాషారూపానికి సన్నిహితమయింది. ఈ మాట వాడుకలో ఉన్న సిర్‌సిల్ల ప్రత్యేక స్థానిక మాండలిక కేంద్రం అనటానికి మరో నిదర్శన మిది.

* * *

ఇక చదువుకుంటున్నవాళ్ళ భాషావిశేషాలు కొన్ని పరిశీలిద్దాం :

'చెయ్యి/చేయి' శబ్దానికి బహువచనంలో 'చెయిలు, చెయ్యిలు, చెయ్లు' అనే రూపాలు విద్యార్థుల వాడుకలో వినిపిస్తున్నాయి. ఈ రకం మాటలు ఇతర ప్రాంతాల్లోకూడా అంతగా చదువుకోనివాళ్ళ వాడుకలో ఉన్నాయి. 'చేతులు'

అనే మాట కావ్యభాషలోనూ శిష్టవ్యవహారంలోనూ వాడుకలో ఉంది. ఒక్క వేములవాడలోనే ఈ రూపం వినిపించదు. కరీంనగర్, సిర్‌సిల్ల, హుజూరాబాదుల్లో స్థానిక మాండలిక రూపాలతోబాటు ఆధునిక ప్రామాణికరూపాలు కూడా వాడుకలో ఉండటంవల్ల ప్రమాణబలం క్రమంగా స్థానిక మాండలికాలను తొలగించగలదని తెలుసుకోవచ్చు.

'పొయ్యి' శబ్దానికి బహువచనంలో 'పొయ్యిలు' అనేదే కోస్తాలో తెలంగాణాలో వాడుకలో ఉన్న రూపం. కావ్యభాషలో 'పొయ్యిలు' అనే రూపమే దొరుకుతుంది. రాయలసీమలో 'పొవ్వు, పొవ్వులు' అనే రూపాలు మాత్రం ఉన్నాయి. 'పొల్లు' అనే పదమధ్యాచ్చు లోపించిన శబ్దం స్థానికమాండలిక రూపం అనాలి.

సప్తమీ విభక్తి ప్రత్యయమైన 'లో' కు కరీంనగర్ మాండలికంలో '-ల, -లె' అనే రెండు పర్యాయరూపాలు లభిస్తున్నాయి. వీటిలో '-ల' ఒక్కటే వేములవాడ, కోరుట్లల్లో వినిపిస్తుంది. కరీంనగర్, జగ్‌త్యాల, మంథని, పట్టణాల్లో '-లె' అనే పర్యాయ రూపంతోబాటు '-ల' కూడా వినిపిస్తుంది. పెద్దపల్లిలో '-లో' మాత్రమే వాడుకలో ఉంది. సిరిసిల్ల, సుల్తానాబాద్, మెట్టుపల్లి, హుజూరాబాదుల్లో '-ల' రూపాలతోబాటు '-లె' రూపాలుకూడా పర్యాయోపయోగంలో ఉన్నాయి. మెట్టుపల్లి, జగ్‌త్యాలల్లో మినహా తక్కిన అన్నిచోట్లా '-లో' రూపాలు పర్యాయోపయోగంలో ఉన్నాయి. ఆ రెండు పట్టణాల్లో '-ల' రూపాలూ 'లె' రూపాలూ ఉన్నాయి. 'ఇల్లు' శబ్దం సప్తమీ రూపంలో '-ల' రూపాలు, 'ఊరు' శబ్దం సప్తమీ రూపంలో '-లె' రూపాలు, అధికంగా ఉండటం గమనార్హం. ఉచ్చారణకు ప్రధానలక్షణాలైన స్థానకరణప్రయత్నాల్లోని ప్రయత్నభేదంవల్ల లకారం మీది అచ్చు గుణభేదాన్ని ప్రదర్శిస్తుంది. రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల్లో 'లో' మాత్రమే బహుళ వ్యాప్తిలో ఉంది.

సంఖ్యావాచకాల్లో 'తొంబది' అనే కావ్యభాషా శబ్దానికి 'తొంభయ్' అనేది కోస్తా రాయలసీమల వ్యవహారంలో పూర్తిగాను, తెలంగాణా వ్యవహారంలో చాలావరకూ, వాడుకలో ఉన్నరూపం. పదాది తకారానికి టకారం ఆదేశం కావటం తెలంగాణా ప్రత్యేకతల్లో ఒకటి. 'తెంకాయ/టెంకాయ, తేకు/టేకు' లాంటి జంటమాటల్లో ఈ పర్యాయరూపత వ్యవహారప్రసిద్ధమే. 'టొంబయ్/టొంభయ్' అనేదే కరీంనగర్ ప్రాంతంలోని ప్రామాణిక రూపం. దంత్యతవర్ణం ఇక్కడ మూర్ధన్యవర్ణంగా మారింది. దంత్యోచ్చారణనుంచి మూర్ధన్యోచ్చారణకు వాడుకమారే క్రమపరిణామంలో కొంతకాలం దంతమూలీయోచ్చారణ కూడా వాడుకలో ఉండిఉంటుంది. మెట్టుపల్లి వ్యవహారంలో దంతమూలీయ వర్ణోచ్చారణతోటి 'తొంబయ్' అనే రూపం వినిపిస్తుంది. మాండలిక పద పరిశీలన భాషాధ్వని పరిణామక్రమాన్ని గుర్తించటానికి ఎంతగా ఉపయోగపడుతుందో ఈ రూపం నిరూపిస్తున్నది.

'నూరు, వంద' శబ్దాల్లో రెండోది కోస్తాలోనే వాడుకలో ఉంది. రాయల

సీమలోను కరీంనగర్ మాండలికంలోను 'నూరు' శబ్దమే సాధారణ వ్యవహారంలో ఉంది. పత్రికల, సినిమాల, ఆధునిక రచనల ప్రభావంవల్ల 'వంద' శబ్దం ఎక్కువ వ్యాప్తిలోకి వస్తున్నది. వంద శబ్దం కొందరి వాడుకలో పర్యాయోపయోగంలో ఉండగా మరికొందరు 200 పై సంఖ్యను చెప్పేటప్పుడు 'వంద' శబ్దాన్ని మాత్రమే (కోస్తాలోలాగా) వాడుతున్నారు. రాయలసీమలో 'ఇన్నూరు, మున్నూరు, నన్నూరు...' లాంటి రూపాలు మాత్రమే వాడుకలో ఉన్నాయి.

'-మంది, -గురు' అనే రెండు ప్రత్యయాలు పూరణార్థంలో సంఖ్యా వాచకాల చివర చేరుతుంటాయి. ఇవి కొన్ని సమయాల్లో పరిపూరక ప్రవృత్తిలోనూ మరికొన్ని సమయాల్లో పర్యాయోపయోగంలోనూ వినిపిస్తాయి. రాయలసీమలో 5 దాకా '-గురు' చేరిన రూపాలూ అక్కడినుంచి '-మంది' చేరిన రూపాలూ వాడుకలో ఉన్నాయి. ఉదా॥ ఇద్దరు, ముగ్గురు, నలుగురు, అయిదుగురు/అయిదుమంది...నూరుమంది. కోస్తా వాడుక ఉత్తర భాగంలో ఒక విధంగానూ, దక్షిణభాగంలో మరోరకంగాను, ఉంది. ఉత్తర భాగంలో 10 దాకా '-గురు' చేరుతుంది; ఆ మీద '-మంది' చేరుతుంది. ఉదా॥ ఇద్దరు...ఏడుగురు, ఎనమండుగురు, తొమ్మండుగురు, పదిమంది...నూరుమంది/వందమంది. దక్షిణ భాగంలో 5 వరకూ ఒక విధంగా ఆ మీద మరోవిధంగా వాడుక ఉంది. ఉదా॥ ఇద్దరు...అయిదుగురు/అయిదుమంది, ఆరుగురు/ఆరుమంది, ఏడుగురు/ఏడుమంది, ఎనిమిది మంది, తొమ్మిది మంది, పదిమంది...వందమంది. కరీంనగర్ మాండలికంలో '-మంది' 8 నుంచి, 9 నుంచి, 10 నుంచి, రకరకాలుగా వాడుకలో ఉంది. ఈ ప్రత్యయం వాడుక అన్యప్రాంత వ్యవహార ప్రభావంవల్ల భిన్న ప్రదేశాల్లో భిన్నదశల్లో ఉందని చెప్పవచ్చు. 'మంది' శబ్దం 'అనేకులు' అనే అర్థంలో రాష్ట్రవ్యాప్తంగా వాడుకలో ఉంది — "మంది ఎక్కువైతే మజ్జిగ పలచనవుతుంది", మొదలైన సామెతల్లో.

మహాప్రాణధ్వనులను (ఒత్తిపలికే ధ్వనులను) సరిగా ఉచ్చరించగలగటం విద్యాధిక్యానికి గుర్తు. 'భయం, ఫలహారం' మొదలైన శబ్దాల్లో కొందరు 'ఫ, భ' లను పల్కటం, కొందరు పలకలేకపోవటం, వారివారి విద్యార్హతలమీద ఆధారపడి ఉంటుంది. ఇది రాష్ట్రవ్యాప్తమైన సాధారణ లక్షణం. విద్యావంతులం అనుకొనేవాళ్లు కొందరు 'భాష్పం, భీభత్సుడు' మొదలైనచోట్ల పదాదిని మహాప్రాణవర్ణాలను పలుకుతుంటారు కూడా. 'ఫలాహార' శబ్దాన్ని (ఫల + ఆహారం) సవర్ణదీర్ఘం లేకుండా పలకటం విద్యావంతుల్లో కూడా చాలా మంది చేసే పని. ఈ శబ్దాన్ని సంక్షేపించి 'పలార' మనటం చదువుకోనివాళ్ళ సాధారణ పద్ధతి. రాష్ట్రమంతా ఇంతే. ఇదే తీరు ఉచ్చారణ ఇంకా కొందరు విద్యార్థుల వాడుకలో నిలవటం గమనించదగ్గ విషయం. పరమధ్యాచ్చును లోపింపజేసి 'పల్హారం' అని వాడటం ఉర్దూభాషాప్రభావంవల్ల కావచ్చు.

'హోటల్' అనే ఆంగ్లపదంలోని తొలి హల్లు లోపించటం రెండు పట్టణా

ల్లోని విద్యార్థుల భాషలో కనిపిస్తున్నది. సామాన్యంగా చదువుకోనివాళ్ళ భాషలో ఉండే ఈ లక్షణం విద్యార్థుల భాషలో ఇంకా నిలిచి ఉండటం గమనార్హమే.

* * *

పై విధంగా ఒక్కొక్క వృత్తికి, కులానికి, పట్టణానికి, చెందిన వ్యక్తుల భాషావిశేషాలను విపులంగా చర్చించవచ్చు. వీటన్నిటిలోనూ కనిపించే సామాన్య లక్షణాలను గుర్తించి సూత్రీకరించి కరీంనగర్ మండల భాషకు ఒక లిఖిత వ్యాకరణాన్ని నిర్మించవచ్చు. ఆ ప్రయత్నం ఎటూ జరుగుతునే ఉంది. ఇక్కడ స్థూలంగా సూచనప్రాయంగా కొన్ని లక్షణాలను మాత్రం వివరించటం జరిగింది. కరీంనగర్ మాండలికం తెలంగాణా ప్రాంతీయ భాషా రూపంలో ఒక భాగం మాత్రమే. అయినా తెలంగాణా ప్రాంతీయ ప్రామాణిక భాషకు దీన్ని కొన్ని విషయాల్లో ప్రతినిధిగా పరిగణించవచ్చు. ఈ మాండలికంలోని సాధారణ లక్షణాల్లో ముఖ్యమైనవి నాలుగు : (i) ద్విరుక్త-అద్విరుక్త హల్లులు పర్యాయోపయోగంలో ఉండటం; (ii) హ్రస్వదీర్ఘ భేదమే గాక అచ్చుల్లో అర్ధదీర్ఘత కూడా ఉండటం; (iii) ఒక పదంలో అకారానికి ముందున్న వివృతాచ్చు సంవృతం కావటం; (iv) పదమధ్యాచ్చులు లోపించి అనేక సంయుక్త వర్ణాలు ఏర్పడటం.

ద్విరుక్త హల్లును అద్విరుక్తంగాను, అద్విరుక్త హల్లును ద్విరుక్తంగాను ఉచ్చరించటం రాయటం చాలా ప్రాచీన కాలంనుంచీ తెలుగులో కనిపిస్తుంది. తెలుగులో సన్నిహిత సంబంధం గల 'కొండ' భాష వంటి భాషల్లో ద్విరుక్తతా-అద్విరుక్తతలు అర్థభేదకాలు కావు. 'వచ్చిన' అనే చోట 'వచిన', 'కుమ్మరి' అనటానికి బదులు 'కుమరి' అనీ, అట్లాగే 'దెబ్బ అనటానికి బదులు 'దెబ', 'పిల్లగాండ్లు' అనటానికి బదులు 'పిలగాండ్లు' అనీ, పలకటానికి రాయటానికి అనేక కారణా లుండవచ్చు: (i) ఉచ్చారణత్వర లేదా లేఖనత్వర; (ii) ఎట్లా పలికినా రాసినా అర్థభేదకత లేకపోవడం; (iii) ఒక ధ్వనిమీది ఊనికకూ ద్విరుక్తతకూ భేదం గుర్తించకపోవటం; (iv) నొక్కిగాని తేల్చిగాని చెప్పదలచటం; (v) ఉచ్చారణ వ్యవధి అటు అల్పమూ ఇటు అధికమూ కాక మధ్యేమార్గంలో ఉన్నందున హల్లుల్లోకూడా హ్రస్వదీర్ఘోచ్చారణ ఉండగా ఆ లక్షణాన్ని గుర్తించలేకపోవటం. ఈ పరిస్థితి తెలుగు భాషకు కొత్తేమీ కాదు. 'ముకు/ముక్కు, అపుడు/అప్పుడు', మొదలైన జంటమాటలు చాలావాటిని 'అక్కటాదు' లని పేర్కొని ఈ లక్షణాన్ని సంప్రదాయ వ్యాకరణాలు గుర్తించాయి. అక్కటాది వర్గంలో ఈ రకం మాటలన్నిటినీ చేర్చవచ్చు. ఈ రకం మాటలు కరీంనగర్ మాండలికంలో ఈ నాటికీ అసంఖ్యాకంగా ఉండటం గమనించదగ్గ విషయమే.

హ్రస్వదీర్ఘ భేదాలేగాక అచ్చుల విషయంలో అర్ధదీర్ఘత ఉండటం కూడా ఇక్కడ సాధారణంగా వినిపించే విశేషలక్షణమే. వాక్యాంతంలో వినిపించే అర్ధదీర్ఘత కారణంగా భూతకాలికసమాపకక్రియ 'వచ్చిన.' అనేది భూతకాలిక ధాతుజవిశేషణమైన 'వచ్చిన' తో సమాన ధ్వనిగా వినిపిస్తుంది. అట్లాగే అనేక - ఇతర సందర్భాల్లో దీర్ఘాచ్చు అపేక్షితమైనప్పుడు హ్రస్వమూ హ్రస్వాచ్చు

భావితమైనప్పుడు దీర్ఘమూ ఉన్నట్లుగా వినిపిస్తాయి. ఉచ్చారణ విధేయంగా రాసిన వ్యవహర్తల సంభాషణ పాఠాల్లో ఈ భేదాన్ని పాటించటం జరిగింది. ఈ లక్షణం అంతో ఇంతో రాష్ట్రవ్యాప్తంగా ఉంది. ఇక్కడేమో అత్యధికంగా ఉంది. సంబోధనలో (పిలిచేటప్పుడు) దీర్ఘంకన్నా అధికకాలం ఉచ్చరించే 'ప్లుత' మనే ధ్వని విశేషం ఉందని మన వ్యాకర్తలు గుర్తించారు గాని అర్ధదీర్ఘ తను గుర్తించలేదు. ప్రశ్నార్థకంలో మాటచివర '-ఆ' చేరటం కోస్తాలో రాయలసీమలో **సాధారణంగా** ఉండగా, కరీంనగర్ మాండలికంలో ఇది దీర్ఘ తరంగా పురుషబోధక ప్రత్యయానికి ముందు వినిపిస్తుంది. ఉదా॥ కోస్తా: వచ్చావా ?; రాయలసీమ : వచ్చినావా ? ; కరీంనగర్ : వచ్చినావ్ ? (తెలం గాణాలోని ఇతర ప్రాంతాల్లో 'వచ్చినవా ?' అనికూడా వ్యవహారంలో ఉంది. ఈ ప్రాంతంలోనే మరికొన్ని చోట్ల ఈ రెండు రూపాలూ కొంచెం అర్థభేదంతో వ్యవహారంలో ఉన్నాయి). ఈ అధికదీర్ఘత కూడా భాషలో ఇతరత్రా లేక పోలేదు; అయితే అది ఇతర సందర్భాల్లో వినిపిస్తుంది. ఉదా॥ 'వచ్చా.వ్ ?' అనే ధ్వనిసంఘటన కోస్తాలో ఆశ్చర్యసూచకంగా, ఆక్షేపణ సూచకంగా, అవహేళన సూచకంగా (కొన్ని సమయాల్లో ప్రశ్నార్థకంగా **కూడా**) వినిపిస్తుంది. ఇట్లాంటి పోలికలను బట్టి భాషాసమష్టిలో కొద్దిగానో గొప్పగానో ఉన్న లక్షణాలే భిన్న ప్రాంతాల్లో భిన్నవిధాలుగా భిన్నప్రయోజనాలతో వ్యవహారంలో నిలుస్తాయని చెప్పగలం. ఈ హ్రస్వదీర్ఘతల మారుపాటులో గూడా అక్షరసంఘటన (**Syllabic structure**) మీద ఆధారపడ్డ నియమం లేకపోలేదు. అనేకాక్షరాలు గల దీర్ఘపదంలో/వాక్యంలో ద్వితీయాక్షరం/పదం తరవాత దీర్ఘాచ్చులు హ్రస్వం కావటం కనిపిస్తుంది. ప్రస్తుతానికి సూచనప్రాయంగా ఈ విషయాన్ని ప్రస్తా వించి వదలటం చాలు. కొన్ని జంటమాటల్లో హ్రస్వదీర్ఘ భేదం అర్థభేదకం కాక పోవటం భాషలో లేకపోలేదు. ఉదా॥ అతడు/ఆతడు.

ఈ మాండలికంలో ఇట్లాంటివే మరిరెండు ప్రత్యేకలక్షణాలున్నాయి. ఒక పదంలో అకారానికి ముందున్న వివృతాచ్చు సంవృతం కావటం విద్యాధికుల భాషలో నియతంగా వినిపిస్తుంది. 'మేడ, కోడలు', పిల్లి; పిల్ల. అందువల్ల విద్యార్జనకూ ఈ మార్పుకూ అన్యోన్య సంబంధముందని గుర్తించాలి.

పదమధ్యాచ్చులు లోపించినందువల్ల అనేక సంయుక్తవర్ణాలు ఏర్పడటం ఈ మాండలికం ప్రత్యేకతల్లో మరొకటి. హ(ల్లు), అ(చ్చు), హ(ల్లు), అ(చ్చు), [హ(ల్లు), అ(చ్చు)] అనే అక్షర సంఘటనగల పదాల్లో పదమధ్యంలో ఉన్న -ఇ-, -ఉ-, -అ-, అనే అచ్చులు బహుళంగా లోపిస్తుంటాయి. అందువల్ల హ(ల్లు), అ(చ్చు), హ(ల్లు), హ(ల్లు), అ(చ్చు)- అనే అక్షర సంఘటనలో పద మధ్య సంయుక్తవర్ణాలు ఏర్పడుతుంటాయి. ఇందుకుకొన్ని కారణాలుండవచ్చు : (i) ఉచ్చారణత్వర; (ii) పదమధ్యంలో భిన్నహల్సంయోగం ఎక్కువగా ఉండే ఉర్దూవంటి ఇతరభాషల ప్రభావం; (iii) ఈ అచ్చులు లోపించినంతమాత్రాన అర్థభేదం కలగకపోవటం; (iv) చారిత్రకంగా ప్రత్యయగతాచ్చులు ధాతుగతాచ్చు

లంత స్థిరంగా లేకపోవటం. భాషలో 'అడుగు/అడ్గు. చిలక/చిల్క' లాంటి అనేక పదాల్లో ఈ రకమైన అజ్లోపహేతుకమైన పర్యాయ పదరూపత ఉంది. అదే ఈ మండల భాషలో అధికంగా ఉంది.

## పట్టిక 1.

| ఉపాధ్యాయుడు | కళాశాలా విద్యార్థి - రచయిత | చదువుకున్న వ్యాపారస్థుడు | బేంకు ఉద్యోగి | రాజకీయ కార్యకర్త | హైస్కూలు విద్యార్థి |
|---|---|---|---|---|---|
| అడుగున్రి | అడుగున్రి | అడుగండి/ (°గున్రి) | అడుగున్రి/ (°గండి) | అడుగున్రి | అడగండి |
| అడగాలి | అడుగాలె | అడుగాలె | — | అడుగాలె | అడగాలె |
| అడుగుతే | అడిగితే | అడుగితే | — | అడిగితే | అడుగితె |
| అడిగిన. | అడిగిన. | అడిగిన. | అడిగిన. | అడిగిన. | అడిగిన. |
| అడిగిన | అడిగిన | అడిగిన | అడిగిన | అడిగిన | అడిగిన |
| అడిగే | అడిగేటి | అడిగే | అడిగేటి | అడిగే (టి) | — |
| అడుగుడు | అడుగుడు | అడుగుడు | అడుగుడు | అడుగుడు | అడుగుడు |
| అడుగకు | అడుగకు | అడుగకు | అడగకు/ (-డు-) | అడుగకు | అడ్గకు |
| అడుగుతున్న. | అడుగుతున్న (°తన్న) | అడుగుతున్నాన్ | అడుగుతున్న. | అడుగుతున్న. | అడుగుతున్నాను |
| అడిగి | అడిగి | అడిగి | అడిగి | అడిగి | అడిగి |
| అడగ | అడుగ | అడగ/ (°డుగ) | అడగ/ (°డుగ) | అడుగ | అడగ |
| అడుగుత. | అడుగుత. | అడుగుత. | అడుగుత | అడుగుత. | అడుగుత. |
| అడగు | అడుగు | అడుగు | అడుగు | అడుగు | అడుగు |
| అడిగినా | అడిగినా | అడిగినా | అడిగనా | అడిగినా | అడిగినా |
| — | అడుగని | అడుగని | అడగని | — | — |
| — | అడుగుతం | అడుగుతాం | — | అడుగుతం | అడుగుతాం |
| — | అడుగుదాం/ (°దం) | — | అడుగుదాం | అడుగుదాని | అడుగుదాం |

పట్టిక 2.

| | కేంద్రం | ఉపాధ్యాయుడు | వ్యాపారస్థుడు | బేంకు ఉద్యోగి | రాజకీయ కార్యకర్త | విద్యార్థి | నిరక్షరాస్యుడు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | కరీంనగర్ | అడుగున్రి | అడగండి; అడుగున్రి | అడగండి; అడుగున్రి | అడుగున్రి | అడగండి; అడుగున్రి | — |
| 2. | హుజూరాబాద్ | అడుగండి | — | అడుగున్రి | — | అడుగున్రి; అడుగండి | — |
| 3. | సిర్సిల్ల | అడుగున్రి | అడుగుండ్రి/ అడ్గుండ్రి | అడుగుండ్రి | అడుగుండ్రి | అడుగుండ్రి | అడుగున్రి |
| 4. | మంథని | అడగండ్రి | అడుగుండి/ అడుగండి | అడుగుండ్రి | — | అడుగుండ్రి; అడుగుండి | అడుగుండి |
| 5. | వేములవాడ | అడుగండ్రి/ అడగండ్రి | అడుగున్రి | — | — | అడుగుండ్రి | (అడక్కరాండ్రి) |
| 6. | సుల్తానాబాద్ | అడగండి; అడుగుండ్రి | అడగండి | — | అడుగుండ్రి | అడగండి | — |
| 7. | మెట్టుపల్లి | అడుగుండ్రి | అడుగుండ్రి | — | అడగండి | అడగండి; అడుగుండ్రి | — |
| 8. | జగ్త్యాల | అడగండి | అడుగుండ్రి | — | అడగండి | అడగుండ్రి/ అడుగుండ్రి | అడుగుండ్రి |
| 9. | కోరుట్ల | — | అడగండి | — | అడగండి | అడుగుండ్రి; అడగండి | అడగండి |

## పట్టిక 3.

| శబ్దం | కోరుట్ల | సిర్ సిల్ల | కరీంనగర్ | సుల్తానాబాద్ | మెట్టుపల్లి |
|---|---|---|---|---|---|
| నీరు + లు | నీల్లు | నీల్లు | నీల్లు | నీల్లు | నీల్లు |
| కాలు + లు | కాళ్లు | కాల్లు | కాల్లు | కాల్లు | కాల్లు |
| పద్యం + లు | పజ్యాలు | పద్దేల్ | పజ్యాలు | పజ్యాలు | — |
| ముత్యం | ముచ్చెము | ముత్తెం | ముత్తెం | ముచ్చెం | ముత్తెం |
| వాకిలి + లు | వాకిల్లు | వాకిల్లు | ఆకిల్లు | ఆకిల్లు | ఆకిల్లు |
| ముడి + లు | ముల్లు | ముల్లు | ముల్లు | ముల్లు | ముల్లు |
| పండు + లు | పండ్లు | పణ్లు | పన్లు | పండ్లు | పండ్లు |
| బండి + లు | బన్లు | బన్లు | బన్లు | బన్లు | బండ్లు |
| ఏరాలు + లు | యారాన్లు | యేరాన్లు | యేరాన్లు | యారాన్లు | ఆరాండ్లు |
| పగిలింది | పలిగింది | పలిగింది | పలిగింది | పలిగింది | పలిగింది |
| తగిలింది | తలిగింది | తలిగింది | తలిగింది | తలిగింది | తగిలింది |
| వ్యాపారం | వేపారం | యేపారం | (యవ్వారం) | యాపారం | (యవ్వారం) |
| పుస్తకం | పుస్తకం | పుస్కం(/వయి) | పుస్తకం | పుస్తకం | పుస్తకం |
| శుక్రవారం | శుక్రవారం | సుక్రారం | శుక్లవారం | సుక్రవారం | శుక్రారం |
| వేషం | — | వేషం | యేశం | యేశం | — |
| పిలవండి | పిలుండ్రి | (పిల్చుండ్రి) | పిలువుండ్రి | పిలువుండ్రి | పిలుపుండ్రి |
| అడగటం | అడుగుడు | అడుగుటం | అడుగుటం | అడుగుటం | అడుగుడు |
| ఏడు | యోడు | ఏడు | ఏడు | ఏడు | — |
| పదహారు | పదహారు | పదారు | పదహారు | [illegible] | |

| శబ్దం | కరీంనగర్ | సిర్‌సిల్ల | పెద్దపల్లి | సుల్తానాబాద్ | కోరుట్ల | వేములవాడ | జగ్‌త్యాల | మెట్టుపల్లి | హుజూరాబాద్ | మంథని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చేయి/ చెయ్యి + లు | చేతులు; చెయిలు | చేతులు; చెయిలు | చేతులు | చేతులు | చేతులు | చెయ్లు | చేతులు | చేతులు | చేతులు; చెయ్యిలు | చేతులు |
| పొయ్యి + లు | పొయ్యిలు; పొయ్లు | పొయ్యిలు; పొయ్లు | పొయ్లు | పొయ్లు | పొయ్లు | పొయ్లు | పొయిలు | పొయ్లు | పొయ్యిలు | పొయ్యిలు |
| ఇల్లు + లో | ఇంట్ల; ఇంట్లో | ఇంళ్లె; ఇంట్లో | ఇంట్లో | ఇంట్ల; ఇంట్లో | ఇంట్ల; ఇంట్లో | ఇంట్ల; ఇంట్లొ | ఇంట్ల | ఇంట్ల | ఇంట్ల; ఇంటిలో | ఇంట్ల; ఇంట్లో |
| ఊరు + లో | ఊర్లె; ఊర్లో ఊళ్ళె | ఊర్లె; ఊర్ల | ఊళ్ళో | ఊళ్ళె; ఊళ్ళో | ఊర్లో/ ఊల్లో | ఊల్లొ | ఊర్లె | ఊళ్ళె; ఊర్లె | ఊళ్ళె; ఊరిలో | ఊర్లో; ఊల్లె |
| 90 | — | టొంబయ్ | — | టొంబయ్; తొంభయ్ | టొంబయ్ | — | టొంబయ్ తొంభయ్ | టొంబయ్; త్తొంబయ్ | — | — |
| 100 | నూరు; వంద | — | — | నూరు; 200 నుంచి వంద | నూరు;200 నుంచి వంద | — | నూరు; వంద | నూరు; 200 నుంచి వంద | — | — |

## పట్టిక 4, తరువాయి

| శబ్దం | కరీంనగర్ | సిర్ సిల్ల | పెద్దపల్లి | సుల్తానాబాద్ | కోరుట్ల | వేములవాడ | జగ్ త్యాల | మెట్టుపల్లి | హుజూరాబాద్ | మంథని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| -గురు/ -మంది | 7 (దాకా) గురు; 8 (నుంచి) మంది | — | — | 9 (నుంచి) మంది | 10 (నుంచి) మంది | — | 10 (నుంచి) మంది | 9 (నుంచి) మంది | — | — |
| ఫలాహారం | పలహారం | పలహారం | పల్హారం | పలహారం; ఫలహారం | పలహారం; పలారం | పలారం | పలహారం; పలారం | పలారం | — | పలారం |
| భయం | బయం | బయం | భయం | బయం; భయం | బయం భయం | బయం | బయం; భయం | బయం భయం | — | బయం |
| దరఖ్వాస్తు | దరఖ్వాస్తు | దరకాస్తు | దరక్వాస్తు | దరకాస్తు దరఖాస్తు | దరకాస్తు | దరకాస్తు | దరక్వాస్తు | దరకాస్తు | — | దరకాస్తు |
| దవాఖ్వానా | దవాక్వాన | దవాకాన | దవాఖాన | దవాక్వాన; దవాఖాన | దవాకాన | దవాకాన | దవాఖ్వాన; దవాకాన | దవాకాన | — | దవాకాన |
| హోటల్ | వోటల్ | ఓటల్ | హోటల్ | హోటల్ | హోటల్ | హోటల్ | హోటల్ | — | — | — |

# 5

# లిపి సంకేతాలు : వివరణ

1. ~ ఆనునాసిక్యం - మా̃వ
2. ‗ వివృతత్వం - బ్యాంక్, గో̱డ
3. ̥ ఊష్మీకరణం - జ̥మ, కాఫ̥ి
4. ం| వర్గానునాసికం (ఙ, ఞ, ణ, న, మ)
5. |˙ అర్ధదీర్ఘ అచ్చు
6. |' అర్ధదీర్ఘ హల్లు
7. |ᵛ స్ఫోటితాచ్చు - కన్ᵛక
8. ఢ̣ ఈషత్తాడిత స్పర్శం

# 6

# రాజకీయ కార్యకర్త

*కులం :* **మున్నూరుకాపు** *వయస్సు :* **43 సం.**
*ఊరు :* **కరీంనగర్** *చదువు :* **ఇంటర్మీడియేట్**

ఈయన భాషలో సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ పదాలు సమపాళ్ళలో ఉన్నాయి. సంస్కృత పదప్రయోగాల్ని ఉచ్చారణభేదాల్నిబట్టి క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

**వర్ణ సమీకరణం :**

ఉదా : రాజ్జెమ్ (రాజ్యం), సత్తెమ్ (సత్యం), వుద్దెమమ్ (ఉద్యమం) అన్నేయమ్ (అన్యాయం) - పరవర్ణమైన యకారం పూర్వవర్ణాలైన జకార, తకార, దకార, నకారాలతో సంపూర్ణ సమీకరణం చెందింది. తాలవ్య వర్ణమైన యకారానికి పరంగా ఉన్న కంఠ్యాచ్చులు (అ, ఆ) తాలవ్యాచ్చులుగా (ఎ, ఏ) మారాయి. సొసంత్ర (స్వతంత్ర) - లో లోపసహిత వర్ణసమీకరణం చూడచ్చు. వకారం లోపించి వివృతాచ్చైన అకారం సంవృతత్వాన్ని (ఒ) పొందింది.

**మహాప్రాణధ్వనులు అల్పప్రాణాలు కావడం :**

ఉదా : అబిప్రాయమ్ (అభిప్రాయం), ప్రబుత్వమ్ (ప్రభుత్వం), ఆంద్రా (ఆంధ్రా), ప్రదాన్‌మంత్రి (ప్రధానమంత్రి), పద్దద్ (పద్ధతి), స్వార్తమ్ (స్వార్థం), విద్యార్తులు (విద్యార్థులు), అర్తమ్ (అర్థం) - భకార, ధకార, థకారాలు వరుసగా బకార, దకార, తకారాలుగా మారాయి.

* కొన్ని కారణాలవల్ల ఈ రాజకీయ కార్యకర్త వ్యవహార ఖండికను ప్రచురించటం లేదు. లఘుటీక మాత్రం ప్రచురిస్తున్నాం.

**పర్యాయరూపత :**

ఉదా : సొసంత్ర (స్వతంత్ర) అన్యాలమ్ (అన్యాయం) - తకార, యకారాల స్థానంలో వరసగా సకార, లకారాలు ఆదేశమయ్యాయి. ఈ మార్పు ఇంగ్లీషు పదాల్లోకూడా కనిపిస్తుంది. పాల్‌టి (పార్‌టి) - రేఫకు మారుగా లకారం ఆదేశమయింది.

**వర్ణ సంకోచం :**

ఉదా : సాకరి స్తలేద్ - అపదాది హకారం లోపించి పూర్వాచ్చు దీర్ఘం అయింది. వయి స్తండు - అపదాది హకారం లోపించి పరవర్ణమైన తాలవ్యాచ్చుకు ముందు యకారం వచ్చిచేరింది. ఈ మార్పు ఇంగ్లీషు, ఉర్దూ పదాల్లోకూడా కనిపిస్తుంది. ఉదా : యిస్ట్రీ(హిస్ట్రీ), వుకూమత్ (హుకూమత్) - పదాది హకారం లోపించి తాలవ్య, కంఠ్యాచ్చులకు ముందు వరసగా యకార, వకారాలు చేరాయి.

**వర్ణ వ్యత్యయం :**

ఉదా : నారక్కల్లేదు (దానక్కల్లేదు) - రేఫ, నకారాలు పరస్పరం స్థాన వినిమయం పొందాయి.

ఈయన భాషలో పై ఉదాహరణలకు అపవాదాలుగా కనిపించే వర్ణసమీకరణం చెందని రూపాలు (విద్యార్తులు, అన్యాలమ్, స్వార్థమ్), అల్పప్రాణాలుగా మారని మహాప్రాణధ్వనులు గల రూపాలు (భావ్‌కమ్, అర్థమ్, స్వార్థమ్, విద్యార్థులు), పర్యాయరూపత చెందని రూపాలు (పార్‌టి), వర్ణలోపం లేని రూపాలు (హిస్ట్రీ, హుకూమత్) కూడా వాటితోపాటే కనిపిస్తాయి. శిష్ట శిష్టేతరోచ్చారణజ్ఞానం ఈ ద్విరూపతకు నాంది. ఒకే వ్యవహర్తలో ఏక కాలంలో ఉండే ఈ భిన్నోచ్చారణ ఆ వ్యవహర్తల్లోని వ్యవహార పరిణామాన్ని తెలుపుతుంది. ఈ వ్యవహార పరిణామదశలో ఆ వ్యవహర్త తన భాషలో ఇంకో ఉచ్చారణ భేదాన్నికూడా ప్రవేశపెట్టవచ్చు. శిష్టోచ్చారణను అనుసరించే ప్రయత్నంలో ఆ వ్యవహర్త శిష్ట వ్యవహారంలో లేనిచోట్లకూడా ఆ ఉచ్చారణను ప్రవేశపెట్టడం. ఉదా : విధ్యార్తులు (విద్యార్థులు). ఈ ప్రయోగంలో వ్యవ

హర్త తను శిష్టతగా గుర్తిస్తున్న మహాప్రాణోచ్చారణను ఉన్నచోట పాటించక పోవడం లేనిచోట దాన్ని ప్రవేశపెట్టడం చూడవచ్చు. ఒక్కొకప్పుడు ఈ రకమైన ఉచ్చారణను ఒక విషయాన్ని నొక్కిచెప్పవలసివచ్చినప్పుడుకూడా ప్రవేశపెట్ట వచ్చు. ఉదా : మంఛిది (మంచిది).

వ్యవహర్తకు ఒకటికంటె ఎక్కువ భాషల్లో వ్యవహారకుశలత ఉంటే వ్యవహర్త భాషావ్యవహారంలో అవి పరస్పరం ప్రభావితం కావచ్చు. అగ్ఙర్, జ్ఙమ వంటి ఉర్దూ పదాల్లోని గ్ఙ, జ్ఙ ధ్వనులు స్లోగ్ఙన్ (slogan), జ్ఙయ్న్ (Join), క్రజ్ఙ్ (Crush) వంటి ఇంగ్లీషు పదాల్లో మార్గ్ఙమ్ (మార్గం), జ్ఙరగది (జరగదు) వంటి సంస్కృతం, తెలుగు పదాల్లోకూడా వినిపించడం అందుకు ఒక ఉదాహరణ : సహినాయకత్వమ్ వంటి ఉర్దూ పదసంయోజనంవల్ల ఏర్పడిన పద బంధాలు, "అర్తమేంజేస్కుంటనమ్ గ్ఙదాకె", "మేనిషు యిదిగ్ఙదాకె", "ఒకటే పయ్ంట్ యిదిగ్ఙదాకె" "కని మనవనుడుగ్ఙదాకె" "సూత్రమ్ జేసిన్ గ్ఙదాకె", "తొాయివ్‌డసలిది గ్ఙదాకె" వంటి ఉర్దూభాషా ప్రభావంగల వాక్యభాగాలు ఈయన భాషలో ఉన్నాయి.

ఇంగ్లీషు పదాలు విరివిగా ప్రయోగించడంతోపాటు బహువచన నిర్మాణంలో ఇంగ్లీషు పదాలకు తెలుగు ప్రత్యయం, ఇంగ్లీషు ప్రత్యయం రెండూ చేర్చడం చూడవచ్చు. ఇంకా గెయ్న్‌జేసి (Gain), క్రజ్ఙ్‌జేస్ ఇడ్సపెట్టు (Crush), చేంజైతె (Change), జ్ఙయ్న్ గ్ఙవాలె (Join), స్టార్ట్‌గాక (Start) వంటి ఇంగ్లీషు పదాల్తో ఏర్పడిన క్రియారూపాలుకూడా ఈయన భాషలో కనిపిస్తాయి.

**అన్యభాషా ప్రభావంగల కొన్ని వాక్యాలు :**

1. అన్ని పొల్టికల్ ఎవై 'తే ఇకడ పన్జేస్తనయో పార్టీజ్ఙ్
2. యే లీడర్ గ్ఙుడ అనె తంద్గ్ఙ్ తయార్ లెదు
3. ఈ యెదైతె వుద్దెమ్ ఉన్నదో
4. విధ్యార్తు లైదెతె స్లోగ్ఙన్ దిస్కున్రో
5. యెక్కడ యే యిపుడు యేస్టేట్లగ్ఙాని యే మామ్లలగ్ఙాని హిస్టీలగ్ఙాని

యిద్గదాకే యెవ్డైతె ఒక్క కానూన్ జేసిన్రో ఒక సూత్రమ్ జేసిన్ గదాకె మెజారిట్ ఎవ్డుంటడో వాడె లీడరైతరన్నప్పుడు మనవ్ దానికిలాఫ్ల బోవుడేంది.

## రాజకీయ కార్యకర్త

కులం : పద్మశాలి వయస్సు : 50 సం.
ఊరు : పెద్దపల్లి చదువు : బి. కాం.,

విద్యార్థులారా...నేటి యీ సమావేశంలో విద్యార్థులకు చాలా ముఖ్యమైన సమావెశమిది (1) గతాయిదుసమచ్చరాలనుండి ఆర్సమచ్చరాల్నుండి మీ విద్యార్థుల్లో చాలానుంది ఒకరికొకరు సన్నియితంగా వుండి స్నేయితులుగా వుంటూ వచ్చినారు (2) యీ కార్యక్రమమెదైతుందో విద్యార్థులైన మీరు స్నేయితులు విడిపోయ్నపుడు...చేస్కావల్సిన కార్యక్రమమిది (3) ఒక స్నేయితుడు విడిపోతున్నప్పుడు చాలా విచారమ్ గల్గుతుంది...మరో స్నేయితునికి...యెంతో మంది మీరూ...యెంతోమంది స్నేయితులను మిరు విడ్చిపోతున్నారు (4) అదే విధంగా ఐదార్ సమచ్చరాల్నుండి యెంతో ఆప్యాయత్తో మికు విద్యనేర్పిన...ఉపాధ్యాయుల్నిగుడ మిరు విడిపోతున్నారు. అటువంటప్పుడు చాలా విచారంగలుగ్తుందీ - విడిపోయేవాళ్ళకూ యెవరైతే విడిపొతున్నారో యెవరైనైతె విడిచిపెడ్తున్నామో వాళ్ళగుడ విచారమ్ కలుగ్తుతుంది (5) యీ సందర్భమ్లో నేను మ్రెండు మాటల్ చెప్పదల్సుకున్నాను (6) అదేంటంటె విద్యార్థులు విద్యతోపాటు క్రమశిక్షణ తర్వాత స్పోర్ట్స్మన్ స్పిరిట్ - అంటే మనమ్ ఆట్లాడు కుంటావ్ (7) ఆటల్లో వొక విద్యార్థి వోడిపోతాడు - వొక విద్యార్థి గెలుస్తాడు (8) ఫుడ్బాల్ - వొక టీమ్ వోడిపోతుంది వొగ టీమ్ గెలుస్తుంది (9) అయ్తే మనమ్ వోడిపోయామనే విచారముండగుడదు (10) గెల్చెవాళ్ళను మన మభినందించాలె (11)

అదీ స్పోర్ట్స్‌మన్ స్పిరిట్ (12) యిటువంటి అలవాటున్ మనము నేర్చుకున్నా మంటే జీవితమ్ లోపల మనమెంతో ఆదర్శవంతంగ మనమ్ మన జీవితమ్ గడ్పు కోడానికి అవకాశముంటుంది (13) రెండో విశయమేంటంటే విద్యార్థులకు రాజకీయాల్తో సంబందముండకూడదనె వాళ్ళు చాలమంది వున్నారు. (14) ఐతె నేను అటువంటి అభిప్రాయమ్ కలవాణ్ణి కాదు (15) విద్యార్థులకైదైతె వుందో రాజకీయాలు మనవ్ చిన్నప్పట్నుంచే బోదించవలసిన అవ్‌సరముంది (16) మన్ది ప్రజాస్వామ్యదేశమ్ (17) రాజకీయాలు వాళ్ళకు బోదిస్తుగుడ మనమ్ వెల్తున్నామ్ (18) మీ స్టుడెంట్సు...యూనియన్ యొక్క యెలక్ష న్సున్నాయ్ - అద్యోక విధమైన రాజకీయమె (19) అయితే అటువంటి యీ రాజకీయాలు మనమ్ అలవాటు చేసుకోవాల్సిన అవసరమ్ యెంతైనవుంది (20). కాని...వొకటేంటంటే విద్యార్థులకు రెండు డూటీస్ వున్నాయ్ (21) రెండు బాద్యతలున్నాయ్ (22) వొగటేమొ తమ విద్యను కొనసాగించడమ్ - రెండ వది యితర కార్యక్రమాల్లో పాల్గొనడమ్ (23) కని విద్య నొదిలిపెట్టి యితర కార్యక్రమాల్లో పాల్గొనడమనే విషయమైదైతెవుందో దాన్ని - దానికి నేను అంగీకరించేవాణ్ణికాదు (24) మనమ్ విద్య నేర్చుకోవాలె (25) మన విద్యతో పాటు మనమ్ వేరే కార్యక్రమాల్లో పాల్గొనాలె (26) యెందుకంటె మీకు విద్య నేర్పించె తల్లిదండ్రులు యెన్నో యిబ్బందులు పడ్తూ యెన్నో కష్టాలు పడ్తూ అప్పుల్జేస్తూ యెన్నొ...యెంతో చాకిరి చేస్తూ విద్యార్థుల్ని చదివి స్తున్నారు (27) అటువంటప్పుడు వాళ్ళయొక్క ఆ...ఉదయావెదనను మనమ్ గమనించవలసిన అవుసరమ్‌వుంది (28) మన తలిదండ్రుల్ యొక్క బాధను మనమ్ గమనించవల్సిన - ఉంది (29) వాళ్ళ వుద్దేశాన్ని మనమ్ సఫలమ్ చెయాల్నంటె మనమ్ విద్యయే...విద్య యెల్లప్పుడుగుడ కొనసాగిస్తు వుండి మీ|రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొనండి-సోశల్ కార్యక్రమాల్లో పాల్గొనండి-యితర కార్యక్రమల్లో పాల్గొనండి - యే...యెన్ని కార్యక్రమాల్లో మనమ్ పాల్గొన్నప్పటిగ్గుడ మనతల్లిదండ్రులయొక్క బాధ్యత...బాధనేదైతె గుర్తించి మన విద్యనుగుడ కొనసాగించి మనమ్ విద్యావంతులమ్ ఐనప్పుడే మనమ్ మన

దేశానికీ మనమ్ సెవజేసిన వాళ్ళమౌతామ్ (30) మనమ్ ఐదుమ ఏంలు విద్య పోడగొటుకున్నామంటె యెంతో యిబ్బంది వాళ విద్యార్థులకు (31) ఆ విద్యార్థులు పరీక్షలో ప్యాస్‌కావాలంటే చాలా యిబ్బందైతుంది (32) యీ యిబ్బంది పరీక్షరాసెటపుడు మనకు దెలుస్తుంది (33) అందువల్ల మనగ్గు కావల్సిందెంటంటే మన రాజకీయ విష్యాల్లో మనమ్ పాల్గొనవచ్చు - యితర సాంస్కృతిక కార్యక్రమాల్లో మనమ్ పాల్గనవచ్చు కానీ...అన్నిట్తోపాటు మొదటిది విద్య...తర్వాతది మిగ్గతా కార్యక్రమాలు (34) అందువల్ల తల్లి దండ్రులయొక్క బాధ్యతను తల్లిదండ్రులయొక్క బాధను మీరంతా గుర్తించి ఆ...యికముందు మీకు...మీ కార్యక్రమాల్లోపల మీరు ప్రవర్తిస్తారనే వుద్దేశమ్‌తో నేను ఆశిస్తూ యీ యింతడితో ముగిస్తున్నాను.

**లఘువ్యాఖ్య :**

***వ్యవహారఖండిక :*** విద్యార్థులు - క్రమశిక్షణ (ఉపన్యాసం)

ఇది పాఠశాల వార్షికోత్సవసందర్భంలో ఇచ్చిన ఉపన్యాసం రికార్డింగ్. ఉపన్యాసంలో సంస్కృతపదాలు అధికం. ఇంగ్లీషుమాటలు కొద్ది. ఉర్దూమాటలు లేవు. ఇది ఉపన్యాసశైలిగా చెప్పవచ్చు. సంస్కృతపదాల ఉచ్చారణలో మిగతా చదువుకున్న వారిభాషలో లాగానే కొన్ని తేడాలు కనిపిస్తాయి.

మహాప్రాణోచ్చారణను పాటించిన పదాలు, పాటించని పదాలు, ఒకే పదాన్ని ఉచ్చరించేప్పుడు ఒకసారి ఆ ఉచ్చారణను పాటించి ఇంకోసారి పాటించని సందర్భాలు ఉన్నాయి. ఉదా : బాద్యత/బాధ్యత. దీన్నిబట్టి విద్యావంతుల భాషలోకూడా నిత్యవ్యవహారంలో (వేదికమీద తూచితూచి మాట్లాడే ఉపన్యాస శైలిలోనైనాసరే) ఈ ఉచ్చారణ తరచు లోపిస్తుందని, అయితే దాన్ని పాటించడం శిష్టతగా పరిగణిస్తున్నారని తెలుస్తుంది. మహాప్రాణోచ్చారణ లోపించిన చోట అన్యభాషా ప్రభావంవల్ల ఇంకో ఉచ్చారణను ప్రవేశపెట్టడంకూడా జరగవచ్చు. ఉదా : సఫలమ్ (సఫలమ్)

పదాదిన, పదమధ్యంలో హకారం లోపించడం పరాచ్చు తాలవ్యాచ్చయితే దానిముందు యకారం చేరడం ఈయన భాషలోను ఉంది. సంస్కృతంలోవి ఋకా

రోచ్చారణ ఆధునికుల భాషలో రేఫ ఉకారాల ఉచ్చారణకు దగ్గరగా ఉంటుంది. అయితే ఈయన భాషలో పదాది హకారం లోపించడంతో పరవర్ణమైన ఋకారంలో రకారోచ్చారణకూడా లోపించింది. ఉదా : ఉదయావేదన (హృదయావేదన).

ఈయన భాషలో ఇంకో గమనించదగిన అంశం ఉత్తమ పురుష ఏకవచన ప్రత్యయం క్రియాపదం చివర నిలపడం. ఇతరుల భాషలో (విద్యావంతుల్లోను) ఈ లోపం నిత్యం.

**అన్యభాషా ప్రభావంగల కొన్ని వాక్యాలు :**

1. ఈ కార్యక్రమ మేదైతుందో
2. యెవరైతె విడిపోతున్నారో- యెవర్నైతె విడిచిపెట్టున్నామో వాళ్ళగుడ
3. బాధ నెదైతె గుర్తించి
4. విద్యార్థుల కేదైతె వుందో
5. పాల్గొనడమనె విషయమ్మైదెతెవుందో దాన్నిదానికి
6. ఈ సందర్భంలో నేను మర్రెండు మాటలు చెప్పదల్సుకున్నాను

## బేంక్ ఉద్యోగి

కులం : రెడ్డి వయస్సు : 33 సం.

ఊరు : హుజూరాబాదు చదువు : హెచ్. యస్. సి.

ఫస్ట్ మార్చ్ నైన్టీన్ సిక్టీసి (1) ఆ తర్వాత ఫోరియర్స్ సెన్ తర్వాత ట్రైనింగ్ హైదరవాదుగ్గు వోయ్న (2) ఏ ఉ పొయొచ్చిన్ తర్వాత వన్నియర్ కరిమ్‌నార్‌లుండి మల్లుజురవాద్‌కి పోస్టింగ్ జేసిర్రు (3) చేసిన్ తర్వాత వనండా ఫ్టియర్సైనంక ట్రైనింగ్ మల్లా మద్రాస్ (4) ఆ తర్వాత రీ పోస్టింగ్ మల్లి వుజూరావాద్ (5) ఇపుడికడ్కెవున్న ఇగ్గ ఇక్కడ్నె (6) ట్రీయండాఫ్

మంతున్నన్న (7) త్రీయండావ్ మంతున్నండి అట్నుంచి అదే ప్రేక్టికల్ ట్రైనింగ్ మారాష్ట్ర విజిట్జేస్న ఔరంగవాదున్ను బోంబై (8) దాన్తర్వాత మల్లి ప్రేక్టికల్ ట్రైనింగ్ మద్రాస్ తంజావూర్ డిస్ట్రిక్ట్‌లో (9) ఇయ్‌సైట్ సీంగ్ సన్ని బ్యాయ్‌నమ్ (10) అక్కడున్నంచి రామేశ్వరమూ మదురై కాళఅస్తి ఆ తిర్‌చునాపల్లి శ్రీరంగమ్ అవ్‌ని రాజకోట అవన్ని వొయింటిమ్ (11) అక్కడి టెంపుల్స్ చాల అందగున్నయన్‌కొండి అక్కడియ్ (12) ఇక్కడ మన దగ్గ రేవంత బాగ ఇది లేవు (13) అటియే టెంపిల్స్ మంచిగున్నయ్ - చాలా బాగున్నయ్ (14) ఆ ఆ లేదు నార్త్‌కు బోతె నార్తుకు బోతె (15)

ఇంతవరగ్గైతె బాగ్గనే ఉన్నయి డిపాజిట్స్ (16) ఊ ఫార్‌మర్స్ లోనింగ్ మంచిగ్గున్నదిక్కడ (17) వసూల్ బాగ్గ లేదు (18) ఫార్‌మర్సు చానమంది జేస్‌కున్నర్ లేండి గని విలేజ్ లీడర్సుంటరుగద వాల్లమీదెక్కువ ఆదారపడుంటరు వాల్లు ఫార్‌మర్సు డబ్బు తీస్కబోవుడేగాని తీస్కచ్చుడేగాని అట్ల (19) ఎజుకేటెడ్ గాదు (20) ఇంకేముంటది (21) ఉజ్‌రవాద్ తాలుక మొత్తం మొత్తమొస్తరు సెక్రెట్రి ప్రెస్‌డెంట్లొస్తరు ఎది విల్లేజ్ చేశ్నవాణ్లు ఊ ఫార్మర్సరారనుకోండి అది (22) యెనక జేశ్నెల్లె వొస్తరు డబ్బు దీస్కవోతరు (23) వాల్లు పంచాయ్టి జేస్తరు (24) ఓ మాకు అనుమాన్నకాడ సుప్రేజర్న దోలిస్తం డబ్బులు పంచాయ్టి జేస్‌కుంటందుకు (25) బ్యాంకినిస్పెక్టర్లే కాని లేకబోతె సూప్రవేజర్లేకాని పొయ్‌వాల్లు డిజ్‌బర్జేసేస్తరు (26) ఓ సొసైటీస్ కోపరేటివ్ క్రెడిట్ సొసై యంపిసేస్లకే ఇస్తమ్ (27) డైరెక్ట్‌గ లేదు త్రూ సొసైటీ త్రూ సొసైటీద్వార (28) ప్రతి గ్రామానికీ ఒ సొసైటీ ఉన్నదనుకొండి (29) ఆ సొసైటి మెంబర్స్‌కె డబ్బుబోతది (30) ఆ డబ్బు తీసకచ్చేటందుకు ఓ సొసైటీ మెంబర్సు బాడీ ఎన్నుకుంటదన్నట్టు (31) అందులో ప్రెస్‌డెంట్‌సెక్రట్రి వైస్ ప్రెస్‌డెంట్లుంటరు (32) వాల్లు బేంకు నుంచి డ్రా చేసెటానికి ఎవరికి అదికారాలిస్తరు యేంటి అది వాల్లు తీర్మానం జేస్‌కుంటరన్నట్టు (33) వాల్లొచ్చి మ దగ్గర ట్రాయల్ బైడ్తె దాన్ప్రకారంగ చెకవ్ జెసి డబ్బిస్తమ్ ఎది వాల్ల మెంబర్సుకీయ్యమని (34) తర్‌వాత ఇచ్చింతర్

వాళ రిపోర్ట్ మాక్ బంపిస్తరు మెంబర్స్‌కిచ్చినట్టు (35) ఆఁ కల్సుకుంటరు సమచ్‌రంకోసారి గ్కల్సుకుంటరు (36) నెలకోసారిగుడ ఇక్కడ యీ బ్రాంచ్‌ల గుడ మీటింగుంటద (37) ఇక్కడి బ్రాంచిల నెలకొక్‌సారి సుప్రవేజర్ల మీటింగు ఒక మా హెడాఫీస్ నుంచి ఆఫీసర్లొస్తరు (38) వాళ్లయొక్క రివ్‌యూ వేరె ఆ మంతు రివ్‌యూ ఎమి ఆ మంతు ఎంత వరుకు జరిగింది యె యె స్కైసెటి పిటిట్ జేసినయే యేమ్టి యేమ్‌కత అవన్ని జూస్‌కుంటరన్నట్టు (39) ఈ ఇన్స్పెక్షన్ రిపోర్ట్సుగాని, వేరె వెరిఫ్ఫికేషియల్ రిపోర్ట్సుగాని యేదేగాని ఫీల్డువర్కుయేది పెండింగుంటె అదె రివ్‌యూ జేయ్‌స్తరు ఆఫీసర్ వచ్చి (40) దాన్ ప్రకారంగ కాకుంటె వాళ్లు నోట్ జేస్కుంటరు (41) మల్ల నెక్ట్సు మంతులన్న కంప్లీట్ జెయాల్సొంటరు (42) కలెక్షన్ గురించడుగుతరు (43) యెక్కడే యెమ్ కష్టాలున్న యేమ్టి యేమ్ లెకుంటె సాల్వ్సల్లె చేస్తారా ఆల్ట్రేసన్ పైలేస్తరా చేయించమంటే పీళ్లేసేకాడ పీళ్లెయాలె లెకుంటె బాడుగ్గతోంజెయించెకాడ జెయించాలె అట్ల (44) నాదిలేదు నాదిలేదు నాదిలేదు వేరే వాండ్లే అది ఇన్స్పెక్టర్లుంటరు ఎగ్జుటివ్ ఆఫీసర్ అట్ల ఆ వాల్లు ఉంటరు బ్రాంచ్ మెనేజర్లుట్లోరు (45) అంత ఈ వన్ని వన్నాండాఫియర్ నుంచె డెవ్‌లవ్ అవ్‌పత్తుంది పుజ్‌రాబాద్ (46) అంతకు మొదలు యేమట్ల పల్లెటూళ్ళక్కనే ఉండె (47) వన్నాండాప్ఫు యియర్‌నుంచి ఇక్కడ డెవులపంటే వూ పది యింపార్టెంటు పమున్నదిగని వొగ్గటి వొకటి స్టేట్ బ్యాంక్ అఫ్ హైద్‌రావాడ్ వాల్ల బ్రాంచోటి వోపన్‌జేసిన్రు (48) ఊఁ మాదేమో పెనియర్సున్నెంచున్న దన్కోండి (49) కని ఊళ్లె బిజినెస్ వాల్లకి మాత్రం వాల్లెక్వా సానమ్‌జెసి మాదెగ్గరకి డిపాజిట్స్‌కు రాలె అవురూ వాల్లకిచ్చె లోన్సు ఫైస్‌లిటీస్‌గుడ మా దగ్గెర లేవ్‌గద (50) యియాల్రేపు స్టేట్ బ్యాంక్‌గుడ బంజేసిదనుకోండి యేది ప్లెడ్జ్‌లోనా అదీదని క్యాష్‌క్రెడిటని (51) వ్యాపారస్తులకు ఓన్లి ప్లెడ్జ్ లోనిప్పుడిస్తాంది (52) క్యాష్‌క్రెడిటు నాడు ఉండె బోలెడంత క్యాష్‌క్రెడిటు ఇచ్చేరి అట్లా అలోవ్‌శేసేది (53) కని అదిప్పుడు పద్దత్తీసేసినట్టుంది ఇస్త లేరిక్కడ (54) మా మొకది పర్పస్ మాదదిగాదు (55) వ్యవ్‌సాయ్‌దార్లకి అంతె

వ్యవ్‌సాయ్‌దార్లకు కోపరేటివ్ మూవ్ సొసైటీలకంతెగాని ఇండివిజల్ లోస్సైతె లేవ్ మాద్గర (56) మా ధ్గర పంచాయతి డిమాండ్స్‌గుడ మూణ్ణాళ్లేణ్ణనుంచి మాదగరగుడ మంచ్‌గనె అయింది డెవలపయింది డిపాజిట్స్కోవ్ఇక్షన్ జానె ఉన్నదీ అట్ల (57) వ్యాపారం పర్‌వాలేదు వ్యాపారం అంత జరుగుతున్నదను కోండి (58) నేను అంత టూయియర్స్‌నుంచి అంతకెక్వ పాత పురవ్ ఏమి అంత అవ్‌పడ్‌లె డెవ్‌లపు (59) రోడ్స్ గిట్ల క్లీన్‌గనే కొత్తగనే కొత్తగ్గదా ఇదంతా కొత్త (60) ఈ రోడు మొత్తం కొత్తదె (61) ఈ ఇదిగని ఇంకా ఆసైడు పాతవూరిటు ఈ సిన్మాటాకీసవ్‌తల (62) ఇదీ కొత్తగెందన్‌కోండి ఇదంతా (63) ఈ పెట్రోల్ టేంక్ కాణ్ణుంచి అదంత కొత్తనె (64) ఇంతకు బ్పూర్వము యెడాఫీస్ నుంచె మొత్తం డిస్పర్స్‌మెంటయేది మాది (65) కని ఈ త్రీయ ర్స్నుంచి మాత్రం బిగించెస్ ఫుల్‌ఫ్లెడ్‌జేసి మొత్తం లోనింగ్ ఇక్కణ్ణుంచె డిస్బర్జ్‌మెంటు చేసిన్రు (66) ఆడైనా అక్కడికి అందరొచ్చేది (67) అంద రొచ్చి లోన్స్ ఇదె ప్రెస్‌డెప్సెక్రెట్‌ర్లే వచ్చి లోన్ తిస్కపొయ్యేదన్నట్టు (68)

ఇచట పొగాక్ పంటగూడ జాగ్త విస్తారంగచ్చింది (69) ఫైవ్ సిక్సీయర్సు నుంచి ఛార్మినార్ టొబేకో వాల్లుగుడ కంపెనీస్ ఇక్కడ లోనింగిచ్చు పద్ధతి బెట్టిన్రు (70) లాస్ట్‌యియర్ అదే ఇన్ని సమ్మచరాల్నుంచి ఎంకరేజ్‌మెంట్ జేసిన్రు గని లాస్టియరు మత్రం వాల్లు చాలా యిజ్జేసిన్రంట (71) అగ్రిమెంటు యెక్‌రానకిన్ని కింటల్సిన్ని పెట్టలే పండ్‌తయ్ అంతగెక్కైతె మేం దీస్‌కోమ్ అని కొంత మంచ్‌గ లేదని స్టాక్ మంచ్‌గలేదని రిటన్ గుడ జేసిన్రు (72) మొదలే యెంకరేజ్మెంజ్జేసిన్రు గని ఇప్పుడు చాలా నర్వసైపొయిన్రు (73) రైతులు కొంధరు సొయంగ వేరే వేరెపొగాకు అదిగుడ బైడ్తరనుకోండి (74) అది వెట్టి మన ఇది ఊర్నె వ్ తాయెటందుకు అది వేరె ఇదేమో యేమేనా ఒగ్గ కంపెనీకెగని ఇవ్‌తలెవ్‌లు తాగెటందుకైతే అక్కర్రాదది అట్ల (75) సిగ్గరెట్ పొగ్గాకు వరకే అంతె వర్జీన్యా వాల్లు ఏది మన చార్మినార్ కంపిన్నుండిచ్చేది (76) అంతెగ్గాని ఊల్లెవేరె పొగ్గాకు ఇంక వేరె వాన్లు పెడ్తరది (77) ఆ పొవాకు వేరె వుంటది (78) అది నీల్లు నీల్లతోన్ బ్రండ్తదది

ఇదేమొ వట్టిగ గ్గాలికి వర్శానికె ఇది (79) వర్శానికి బ్బెటిన మొదలు వర్శానికి బ్బెట్టిన బాబత్దే ఇదంతె వట్టిగ బ్బండేది (80) ఇగ ఊళ్లె నీల్లు గ్గబ్టేది మాత్రవ్ తాగెటందుకు విలేజర్సు వాడ్తరది (81) అదిగుడున్నదిక్కడ (82) ఇక్కడ చెరుకు లెదెవ్వరన్న ఒక్కరంతెగని ఇక్కడ చెరుకు లెదు (83) ఈ టూయర్స్ నుంచి మాత్రం వన్నియర్ బేక్నుంచి ఈ ముల్కనూరోల్లును మక్థ మొలనూరు మక్థవాణ్ణు షుగర్ ఫ్యాక్టరి ఖండసారి షుగర్ ఫ్యాక్టరి కొరకు ప్రయత్న జేసిను) స్టేటు బేంక్' హైద్రవాన్నుంచి (84) చేస్తె వాల్లకు షాక్షన్ అయ్తదని ఉద్దేషంగ వాల్లు కొందరికి ఫ్పార్మర్సుకు చెరుకు బ్బెట్టెటందుకు లోనిచ్చిన్రుగుడ (85) లోనిచ్చిన్రు విత్తనము అదిగుడ తీస్కచ్చి స్ప్లైజేసిన్రు (86) ఇపుడు బానె ఉన్నది చెరుకు ఏడీ ఇపుడు పెట్టిన కాణైతె ఆ ముల్కనూరున్నా మక్తయేది దగ్గర్నె తాట్కల్ దగ్గెరుంటది (87) అవ్రూ ఇపుడేమీ వినికిడి కదాంటే అ ష్యుగర్ ఫ్యాక్టరి వస్తలేద్ పెట్టదల్ పెడ్తలేరు అనేది వినికిడి (88) అది యెంత వరుకు నిజమో తెలువదు (89) కని చాన మందైతె చెరుకు బ్బెట్టిన్రంతట (90) షుగర్ దగ్గర చానవూల్లు బ్బెట్టిన్రు కొందరు ఎక్రము రెండెకురాలు అట్ల (91) ఇమక్తు లెక్వ బెట్టిన్రు వాల్లు వాలు సొంతంగ ఓ సుగరు కంఢసార్ సుగర్ ఫ్యాక్టరి పెట్కుంటమని వాల్లు ప్రెయత్నం జేస్పెట్కున్నర్గని వాల్లుమరి పెట్టలేము అన్నట్టుగ తెల్సిందది మరి ఎంతవరుకు నిజమో తెల్వదు (92) పంట వరి పంట బానే వుంటది (93) ఏన వర్శాలు చెర్లు కుంటలుమీద ఆదారపడుంట దిక్కడ (94) ఇగ్గ ఏవైన బావులుంటె బావులూ అంతెగని ఎక్కువ సోర్స్ మాత్రం వర్షం మీదనే (95) ఇంకవేరే ఏం ఎం మక్కజొన్న పెసరు పల్లి కందులు పొన్నలు ఇంక నానా పంటలు బ్బండిస్తరు (96) ఫ్రెక్టర్సుకు మే విన్వవు (97) ఫ్రెక్టర్స్కు మేవివ్వవ్గని ఇయే ఆయిలింజన్స్ కరెంటు మొటర్సు వాటికి మేవిస్తమ్ (98) ఫ్రెక్టర్సుకు మాత్రం స్టెట్ బేంకున్నా ల్యాండ్ మార్ట్గెజ్ బేంక్ ఆ ద్వారా వాల్లు తీసుకుంటరు ఫ్రెక్టర్సులోన్ (99) మా దగ్గరున్నయి ఆయిలింజన్సు కరంటు మోటర్సు (100) అవురూ మినిమమ్ లోన్సు గుడ ఫ్వయవ్తౌజండ్స్ కెకువ యెక్సిడ్ గావద్దని మా బెలాలగుడ

ఉన్నదన్నట్టు సొసైటీస్ బైలాల (101) ఆ̃ అదిదిగుడ జూస్తమ్ అ̃ అవా̃ బైంకు గుడ సూస్తది (102) ఏది సూప్రవేజర్స్ సూప్రవెజింగ్ట్యాస్యఫుంటదిగద వాల్లు యొక్క క్రాప్స మిద యేయే క్రాపు బైత్తడు యేంకద అదంతజూసి క్రెడిటు లిమిట్ శాంక్షంజేస్తరన్నట్టు (103) ఆ క్రాప్స్మీంచి ఇండివీజల్ రిపేయింగ్ కైపేసిటున్నదా లేదాని అట్ల జూసే వాల్లు తయార్ జేసి పంపిస్తరు రెకమండ్ జేస్తరన్నట్టు (104) దాన్ల మీంకెల్లి బేంకు సాంక్సన్ జేయ్స్తది (105) మన మేజు సీడ్సెగనేదెగనిపుడు బైల్దేరింది గద (106) దానికి చాన మంది ముందుకొస్తున్నరు (107) పెట్టిస్రుగుడ (108) కని కొందరికి భూమిలేక కొందరికి ఫైనాన్సియల్ వీక్ వలన అందుబాట్లో లేని వాణ్లు చాలా వెనుకకు బోతున్నరనుకోండి (109) మల్లదిగాక పెట్టుబడి దని కెక్కువ గావాలె (110) పనిముట్లైనా రకాలు కొత్త గొత్తవి గవాలె (111) అవన్ని దెవ్వాలంటె ఇవన్ని ఐయ్యార్వైటంటె ఇవంత ఎందుకంటె పెత్తె ఎందో వాల్లకు పంట బంత్తదో పండదో అనేదొకటీ బయమున్నా మరి పెట్టుబడెక్కువ గావాలె దానికి (112) ఎకరాల కనీసం ఐయార్వైటుకు ఓ ఫైంద్రూపీ సెక్స్వండిచరచ్చింది (113) మొన్నోల్లెగ్గొట్టింద్రిక్కడఅట (114) కని పంట గుండ మంచ్ గనే వచ్చింది అ ధైర్యం జేస్పెట్టోల్లుండాలె ఆది (115) ఆ̃ ఆ̃ సీడ్సు ఉన్నయ్ (116) సీడ్సవన్నీ యెవ్వెగని అందుబాట్లోవున్నయ్ (117) తెలంగాణా సీడ్సు కోపరేటివ్ సొసైటీ ఏది వరంగల్లున్నది (118) నేషనల్ సీడ్స్ కార్పొరేశనున్నది (119) ఇయాల్రేపు ఈ మన రూరల్ బేంక్ ముల్కనూర్ గుడ సీడ్సు వాల్లు సొంతంగ ఓటిపెట్టి వాల్లుగుడ సీడ్స మెంబర్ వాల్ల మెంబర్స్కే సీడ్సు ఇచ్చుకుంటూ మల్లి సీడ్సుఫామ్గా చేసి విత్తనాలను సప్లై జేస్తున్నరు వేరే తాలూకాలకెగాని డిస్ట్రెల్లెకెగాని (120) వాల్లుగూడ అమ్ముతున్నరు సవ్ రేట్ అన్నట్టు వాల్లది (121) ఇన్రోజ్లేమొ తెలంగాన కోపరేటివ్ సొసైటినుంచి తీస్కచ్చుకునేది ఏది మేజ్ సొసైటినుంచి వాల్లది (122) అది స్థాపించి దగ్గర్ దగ్గర యెనివిదేళ్ళైతుందనుకుంట (123) ఆ̃ యెనివిదేళ్ళైతుంది (124) యెన్మి సమ్చ్‌రమ్లైతె తుందది (125) మొదట్లో బానె ఉండె కానిప్పుడు కొద్దిగ వీక్నెస్ ఏది ఆసీడ్సె

కుక్కవ అమ్ముడు బోతలేవన్నది తెల్సింది (126) స్టాకు ఖాగైపాయిందీ (127) మల్ల అదిగాక దానికి ఒక సంస్థనుంచి సంస్థకు డబ్బు లోస్తుంటెనేగద డెలీ నేషనల్ కోపరేటివ్ ఎదో ఉన్నదాడ సీడ్స్ ఆడా డెలీల వాల్లుగుడ ఎదోశబ్బు లెనకముందపుట్ల యిదిగుడ యెనక ముందైపొయింది (128) దానికిని రోజులు గౌర్నమెంటేదున్నటుండె దానికి (129) అదిప్పుడు లేనట్లుంది (130) గౌర్మెంటు కుద్దు బ్లాక్‌లకు అలాట్ జేసేది అటువంటిది యిప్పుడు లేదా పర్చస్ గౌర్మెంట్టేసేంది (131) గౌర్మెంటు కొనీక్కుద్దు బ్లాకులకిచ్చేది బ్లాకునుంచీ రైతులకు సప్లైజేసేది అట్ల (132) అటువంటిది ఇప్పుడు లేనట్లుందా పద్ధతి (133) అందుట్లో వాల్లె సొంతంగ తిరిగి అమ్ సేల్ జేస్కుంటున్నరు (134) కొందరు సేలు సీడ్స్నైక్వెనంక యేంజేస్తరు స్టాకుంటదిగద (135) ఫార్మ రీస్కచ్చుడుగుడ డబ్బులిచ్చుడు గుడ యెన్కముందైగ్రను లాస్టు వన్నాండాక్ యియర్నుండి యెది తెలంగాన సీడ్సు వాల్లదైతె (136) ముల్కనూరు వాల్లు సొంతగ పెట్టుకున్నరు రైతులకెంకరేజ్మెంటిచ్చుకుంట వాల్ల ఫైనాన్స్ బేంక్ గాబట్టి సబ్యులకు లోనిస్ (137) వాల్లైకె ఆ యేరియా అఫ్ మెంబర్స్ మట్ˇకె ఆ సీడ్సు వాల్లు ప్రొవైడ్ జేసేది (138) అంతెగని వేరే ఆ వా మిగ్త గ్రామాలకు జెయరు (139) వాళ్ళదిగాదు (140) వాల్లగతి ఇగ వేరే అంతె మెంబర్సుకే మాలోనన్నట్టు (141) మల్ల మెంబరు గావలె వాల్లు వాల్లు సొసైటిల మెంబరైతె వాల్లక్ గుడ (142) ఆ హా ఏమ్‌లెదు రిస్ట్రిక్షనేమ్‌లెదు (143) వాల్లు కావచ్చు మెంబర్‌గావొచ్చు లోన్‌దీస్ (144) ప్రొసీజరా (145) సొసైటీలో షైవ్‌రుపీసోటీ షేరూ దాక్టల్ జెయాలె (146) అవురు టొంటి షైవెన్పి యెంట్రెన్స్ ఫీసు దాక్టల్ జేసి ఓ అప్లికేషన నిచ్చుకున్నట్టయ్యేదుంటె అది సొసైటి మేనేజింగ్ కమెటి మెంబర్‌గ తీస్కానేది తీర్మానించుకుంటరన్నట్టు (147) మెంబర్‌గ మీరు నీపు మా ఈ రోజునుంచి మా సంఘానికి సబ్యునివని వాల్లు చెప్తరు (184)దాంతోని అతడు మెంబరైపోతడు (149) అండ్లలయేమ్ పెద్దా కష్టమేమ్‌లేద్ (150) మెంబరా. వాటికిజె మార్కెటింగ్ ఫెసిలిటీసు ఇక్కడ ఓటి తాలుకాలెవల్ల ఓటి మార్కెటింగ్ సొసైటి ఉంటది (151) అది

ఫైనాన్షియల్‌గ మంచిగుండి మంచిగె నడిపించుకుంటెనెమొ బాగుండెదుండె అది వీక్నెసైపోయింది (152) మల్లందులో ఈ మెంబర్సు మార్కెటింగ్ త్రూ మార్కెటింగ్ అయ్‌తెనేమొ బాగుండు (153) వాల్లూ వేరే కమిషను ఎవరి సౌకారిదగ్గరికి వాల్లు భోతుంటరు (154) అటిట్లముకుంటరు (155) ఆ కండిశన్ లేదట్ల బ్యాంక్‌గూడ యెన్నోసార్లు కమేటీబెట్టింది (157) లీకింగ్ అవ్ మార్కెటింగని ఓటి కమేటీలు బెట్టింద్రు (158) సక్సెస్ గావల్నన్‌కున్నరుగని సక్సెస్ గాలే అదేమి (159) చాల కష్టమే అయ్‌పోయ్ అదింప్లిమెంట్ జేస్టందుకు (160) అది మెంబర్సుకు రావాలెగాని మనంజెప్తె (161) వాల్లు డైరెక్ట్‌దెచ్చి కోపరేట్ సంస్తగ్గియ్యాలె అనేదుంటెనేమొ బావుంటదది (162) కని యెదో వానిగ్గి బలవంతానికి దీస్కచ్చి మనం బెట్టాలంటె వీడొపైసకమ్మేనవచ్చు అవ్‌త లోడు బాటపై సెక్వనవచ్చు (163) అందుగ్గోరగ్గా పైసకైనబోతడుగద ఓ మెంబరు (164) అందుగ్గోరకు యేమ్ సక్సెసు ఇక్కడైన్తె యేమ్ అంత సక్సెస్ లేదిడ (165) వాల్లు డిపార్ట్‌మెంటల్‌ను అప్రోచైతరు మార్కెటమ్ క్రెడిట్ ప్రొవేడ్ జెయ్‌గలర్నని (166) ఐతె రిజర్వ్‌బ్యాంకవ్ యిండ్యాగుడ వాల్లకు ప్రొవైడ్జేసింది త్రో స్టేట్‌కోపరేటివ్ బ్యాంక్‌నుంచి సెంట్రల్ బ్యాంక్కు (167) దాని యీల్లలిమిట్‌ను యేది లుమ్సనుబట్టి ఆ ఊ లిమిటు ఫిక్సైతుందన్నట్టు (168)అందులో లిమిటు ఫైనాన్స్ పొజిషనుబట్టి సూసి డీఆర్‌గుడ గింతవరకు యివ్వవల్సిందని రికమెండ్ జేస్తడు (169) అయ్‌తె అండ్లొ యమ్‌సి మా బ్యాంక్ యమ్‌సి గుడ కొంత అమౌంటు వాల్లకు రికమండ్ మన్స్కింతాలాట్ జేస్తది (170) దాంట్ల ఆ లిమిట్ల వాల్లు తీస్కానుడు మల్ల సేలు ప్రొసీడ్సు దాకల్‌జేసుడు అట్ల నడుపుకుంటరన్నటు (171)

**లఘువ్యాఖ్య :**

**విషయం : సహకార పరపతి విధానం**

నేటి ఉద్యోగిబృందం నిత్యవ్యవహారంలో ఇంగ్లీషు వినియోగం ఎంతగా ఉంటుందో ఈయన భాషనుబట్టి గ్రహించవచ్చు. ఇంగ్లీషు పదాలకు బహువచన ప్రత్యయం తెలుగుతోపాటు ఇంగ్లీషు దీ వాడడం, ఇంగ్లీషు క్రియాపదాలు విరి

మిగావాడడం ఈయనలో చూడవచ్చు. షుగర్/సుగర్ (Sugar), షాంక్షన్/శాంక్షన్/సాంక్సన్ (Sanction), బ్యాంక్/బేంకు (Bank), రిటన్ (Return) వంటి ఉచ్చారణభేదాలు, వరుకు (Work), రోడు (Road) వంటి అజంతరూపాలు గమనించవచ్చు. సంస్కృత పదాల్లో తరచు ఇతరుల్లో వచ్చే ఉచ్చారణభేదాలే ఈయన వ్యవహారంలోను చూస్తాం. ఉదా॥ పద్దతి/పద్ధతి, కండసారి/ఖండసారి. ఈ మహాప్రాణ, అల్పప్రాణోచ్చారణభేదాలు ఊర్ల పేర్లలోనూ చూడవచ్చు. ఉదా మక్థ/మఖ్తు/మక్త. ఉర్దూలోని హలంత, దీర్ఘాంత పదాలు ద్విత్వసహితంగా అజంత మవుతాయి. ఉదా॥ క్బద్దు (కుద్), కమ్మి (కమీ). అవురూ (మళ్ళీ), యియ్యాలేపు (ఆజ్‌కల్) వంటి ప్రయోగాలు ఈయన భాషమీద ఉర్దూప్రభావాన్ని తెలుపుతాయి.

ద్విత్వ ళకారం ద్విత్వ లకారంగా మారడం. ఉదా॥ వాల్లు (వాళ్ళు), ఊల్లె (ఉళ్ళో), నీల్లు (నీళ్ళు), మల్లి (మళ్ళీ),

**వర్ణ సమీకరణం :**

ఉదా : సొాయంగ (స్వయంగ), సొంతంగ (స్వంతంగ). వకారం లోపించి పరవర్ణమైన అకారం ఒకారంగా మారింది.

**అన్యభాషా ప్రభావంగల కొన్ని వాక్యాలు :**

1. అనెదుంటెనెమో బావుంటదది.
2. మంచిగె నడిపించుకుంటెనెమె బాగుండెదుండె.
3. డబ్బు లెనకముందవుట్ల యిదిగుడ యెనకముందై పొయింది.

## ఉపాధ్యాయుడు

కులం : పాతాని　　వయస్సు : 43 సం॥

ఊరు : హుజురాబాదు　చదువు : బి. ఎ., బి. ఎడ్.

నేనూ పంథొంద్వందల్ నల్ భై పళ్ళో - ఊ టీచర్ గా చేశేను (1) ఇర్ వై రెండు సంవచ్చరాలైనది (2) అయ్ తే ఇక్కడ టీచర్ - టీచింగ్ ప్రొఫెషన్లో నాకూ కుతూహలమ్ కోరిక వుండే చేరా నేను (3) నా వుద్దేశమేమంటె అపుడు యెమ్మె చెయ్యాల్నని (4) చదువ్ కొనేట్ వంటి అవ్ కాశమ్ చాల తక్కువ ఆర్థిక పరిస్తితి అంతగ అనుకులించక దానికితోడు గపుడు రజాకార్ మూమెంటో టొచ్చిండె (5) రజాకార్మూమెంట్లొ మెమ్ కాలేజీలోచేరి మళ్ళి తిరిగొచ్చి యింట్లొ గూర్చునొన్గ సమచ్చరమ్ (6) ఇగా ఆ తిర్ గడంలొ చదువ్ మీదిం ట్రెస్ట నేది పొయింది ఆర్తికస్థితికనుకూలించలేదు - ఆ కార్ ణంగ వుద్యోగమ్ లొ చేరాను (7) చేరీ ఇంతవరకు ప్రేవ్ట్ గ్రేజ్ వేట్ ను కాగలిగేన్ గాని - యెమ్మె యివ్ డే చేయ్ ల్నాన్ కుంటున్నాను భగవంతుడనుగ్రహిస్తే బవుశ అదిగూడ చేస్తి స్తననే వుద్దేశముంది (8) కని ఒగ తెడా అప్పటిగిప్పటికి చూస్తున్నాన్ సర్ (9) అవ్ డు స్టుడెంట్సంక్య తక్కువ క్లాస్ లో ముప్పైమంది వుంటే మహ యెక్కువ (10) కానిప్పుడు క్లాస్ కు యాభై మందికి పైన నింవ్ తరు (11) అట్లవుంటెనె యాభై మందికి పైన వుంటెనే అందులో క్లాసోపన్ జేస్తర్ లేగ్ పోతె లేదు (12) అయ్ తె య్ పుడు సంఖ్య యెక్వ వుండడమ్ మూలాన రద్దిగా వుంటుంది క్లాసకామడేషన్ కుడ సరిగా చాలదు (13) టీచర్ గుడ యిండి విజల్ అటెన్షన్ అందర్ కీ యివ్వలెదు - స్పెషలీ బ్యాక్ వర్డ్ స్టూడెంట్స్ కి స్పెషలటెన్షన్ లేందీ పిల్లలూ సరిగా చదువ్ లో ముందుకు రాలెరు. (14) ఉ కష్టమ్ చాలగా వుంది. (15) ఆ కార్నమ్ చేతనే వనవ్ ది రీజన్స్ ఆఫ్ ది రిజల్ట్స్ తక్ వగా అయేందుకు స్టేండర్డ్ వ్ యెజుకేషన్ తగ్గేందుగుడ - అది గూడొగ్

కార్ణమ్ (16) యిగ కొన్ని చోట్లొాయ్తె పాట్శాలగ్గదేలేదు (17) యే చెట్ల కిందనో కూచొబెట్కోన్చెప్పవలసిందె - స్పెషలీ విలేజ్ హైస్కూల్స్ చూస్తే అధ్వాన్న పరిస్తితుంది (18) చల యీ సెటప్లో యీ పరిస్తితొచ్చిందాని మాకూ యింతకు పూర్వమ్మేమ్చదుకున్నపుడూ కొత్తగ వుద్యోగం చేసినపడి పరిస్తితిన్ చూస్తే అనిపిస్తుంటుంది ప్రతీ విల్లేజ్కొక హైస్కూల్ చెసిన్రు (19) అకడ అంత సంక్యన్ చూస్తే క్లాస్కు పదీ పదియేనిరభై మందుంటెు మహా యెక్కువ (20) స్టాఫ్ సరిగ వుండదు (21) పోట్సు గార్న్మెంట్యాంక్షన్ చేస్నా టీచర్సు సరిగా హేండ్స సైన్సెన్డ్సగానివండి మేతమటిక్స గనివండి అవైలబుల్ లేకుండా ఒగటి స్పెషలీ యింగ్లిష్ హేండ్సు మరీ రొర్కవ్ (22) యీ కార్నాల చేతగుడ యెజుకేషన్ కాస్త స్టేండర్డు తగ్గుతునె వున్నది (23) దాన్ని సర్దిద్దేందుకు విద్యావేత్తలు యిప్పటికి నిర్విరామంగ క్రుశ్శేస్తునె వున్నరు (24) కాని యింతవరకు ఆ కృష్లొ వారు ఫలితాన్ని పొందలేదనే నెను గట్టిగ నమ్ముతున్నాను (25) ఐతే భవిషత్తు మరీ అటువంటి సిదుపయాలు ప్రభుత్వ మెన్నటికి చేకూర్చగలుగుతుందొ చెప్పెతందుకు సాధ్యం కాదన్నమాట (26) యిటు వ్యవసాయ్ముగూడా యికడెక్కువలేదు వ్యవసాయ్ము చేస్తునేట్వంటి వృత్తికూడా ప్రధాన వృత్తికాదు (27) యిగ మిల్లుల్లో పజ్జేసేట్వంట వృత్తి అవలంబిద్దామన్నా యికడ మిల్సు ఫ్యాక్ట్రిసేమ్ లేవు (28) ఉద్యోగులా యెక్వగా యిక్కడ వుంటారు. (29) మొత్తమ్ అన్ని డిపార్ట్మెంట్స్వైతె వున్నవొ వాట్లో వుద్యోగు లేక్కువ్గా వుంటారు (30) యిళ్ళ కొర్త యిక్కడదికంగనే వుంటుంది (31) సామాన్య ప్రజలు చిల్లర కులి తప్ప యెక్కువ కులి - ఆర్జించె మార్గాలుకుడ యిక్కడెవిలేవ్ (32) కార్ణం చేత యిక్కడి ప్రజలు ఆర్థికంగ యెన్కబడున్నట్టి వొప్కోవల్సొస్తుంది (33) పొగ్రాము మైనప్పటికిన్ని యదార్త పరిస్తితిన్ దాచకుండ వుండాలంటె ఆర్థికంగ యిక్కడ కొంత యిబ్బందితోనే గడుస్తుంది (34) అయ్నా కూటికి...తోజ్... ప్రజల్గుడ యికడెవరు లెరు (35) యిటొరంగలిట్ అనమ్కొండ రెండు పట్టణాలకిది మద్యలొ వుండేట్వంటి టౌన్ కాబట్టి యికడ నాగర్కతలొ

మాత్రమ్ కొంతమార్పొస్తుంది (36) వేషబాషలనండి వాళ జీవితంలో మార్పు లెవైతె వస్తున్నవో క్రమంగ అచ్చువెస్‌నట్టుగ యీ రెండు సిటీస్‌కి రెండిట్నీ వొక్క పరిస్థితిని వుజ్‌రాబాద్‌లొ మాకు తోస్తంది (37) చదువ్‌కునే వాళ యొక్క సంక్య దినదినాన్‌కి పెరుగుతుంది (38) ప్రత్యేకంగ మా క్యాస్ట్‌లో చూడండి నేన్ మెట్రిక్ పైసతే ఒహూ యీ అబ్బాయ్ విడు వెంకటాయ్యా పైసయిండూ విడు చాల బాగ చదుక్కనడన్క్కనెవాళు (39) యిపుడూ మావద్ద డాక్టర్సునారు మా క్యేస్ట్‌లో తశీల్‌దార్లునారు మాలాంటి స్కూలసిస్టంట్సున్నారు దాదాప్ అన్ని డిపార్ట్‌మెంట్సులో మావాళ్ పన్జేస్తునార్ (40) అయ్‌తే అప్పటికిప్పటికి తర్‌వాత్తరమ్ వొళ్ళొస్తువుంటె - అయ్‌తె యిపుడింటింటా చదువ్‌కోని పిల్లగాల్లెవర్లెరు (41) పదియేన్లేల్ల వయస్సున్నవాడు యిపుడు చదువ్ రానివాడు మా క్యేస్ట్‌లో యెవడ్‌లెడు కనీసం ఒక వెయ్‌మందుంటరు మా వాళ్లి క్కడ - మా క్యేస్ట్‌లవాళ్ళు (42) తే అప్పటికిప్పటికి ఒక యిరవై యెళ్ళల్లో వచ్చినట్‌వంటి ప్రదానమైన మార్పు యిదీ నేనూ గమ్‌నించగల్గిన (43) వేరే కులాల్లొగుడ అంతే అన్‌కోండి (44) చిల్లరజాతీవన్ హరిజన్స్‌గుడ యిపుడు చాలా శాతంలో చదు - చవ్‌తున్నారు (45) మయిస్కూల్లొగూడా చాలా మంది పిల్లలిప్పటిక్‌గూడా వున్నారు (46) యింతగు పూర్వమున్నారు (47) చదివ్‌పొయ్‌నారు (48) వాళ్ళిపుడు యెల్డీసిస్‌లవరకూ రాగ్గలేరు హోయ్‌గ వుంటున్నారు అంటే నా వుద్దేశం మేంటె చెప్పడమంటే చదువ్‌లో యీ వుజ్‌రా బాదు చాలా అబివృద్ధి చెందింది (49) ముందొకె పెర్సెంటు చద్‌విన వాళ్ళుంటే యిప్పుడూ టొంటీ టొంటీఫైవ్ పర్సెంట్ వరకు బొయిందని చెప్ప వచ్చు (50) పిల్లలయొక్క క్రమశిచ్చణ భయభక్తులుంటే అప్పటికిప్పటికి చాలా తేడా వచ్చింది (51) మేమ్ చదువ్‌కునేప్పుడు యీ హుజ్‌రాబాద్‌లో మిళ్ళి స్కూలుండేది (52) యిప్పుడిది హైస్కూలైంది (53) రేపు యిక్కడ జూనియర్ కాలెజ్‌గుడ కాబోతుంది (54) అప్పుడు రెండువందలాయాభై మంది మిళ్ళి స్కూల్లొవుంటె యెక్కవ (55) యిప్పుడు వెయ్యిమంది మా హైస్కుల్లో వున్నారు తక్కువె (56) తే పిల్లగాళ్ళయొక్క బిహేవియర్లొ

మాత్రం మార్పొచ్చింది (57) అది కొంతవరకూ యీ మధ్యలో వచ్చేటవంటి యీ స్ట్రైక్సు యీ గొడవలూ యీ గందరగోళాలెనైతె వస్తూనయో అది మాకెమ్ సంబందమ్ లేకపోయ్నా వాటిని మేమ్ పిల్లవాణ్ణన్ సర్దేద్దామ్ సరైన మార్గంలో పెడ్డామనెంత ప్రయత్నించినప్పటికిన్ని చివర్కి టీచర్సుగుడ కొన్ని పర్యాయాలు ఫైలై పోతున్నారు (58) దాని క్కార్ణాలెన్నొవున్నాయన్కోండి - యిహా - అకార్ణాలు మనమ్ చెప్తుంటె పొలిటికల్ లీడర్సునీ ప్రభుత్వాన్ని మనమ్ విమర్శించిన వాళ్ళమౌతామ్ అది మనవుద్దేశమ్ కాదు (59) కని అప్పటికిప్పటికి క్రమశిచ్చణ పిల్లగాణ్ణల్లో మాత్రమ్ తగ్గింది (60) అదిమత్రమ్ నిజమ్ (61) ముందు మెముఎంభ్యయున్నిచూస్తే భయమయేది (62) ఆయనొకసారికొడ్తే యిగా

ఆ వుపాధ్యాయుడాటీచరా యిస్కూల్లో వున్నంతకాలమ్ మేమతని కెదురగపోయ్ మాట్లాడెవాళ్ళంకాదు (63) ఆయన పిల్చి పల్కరిస్తెతప్ప (64) కని యిప్ప డట్లగాదు సంపూర్ణంగ మారిందన్నమాట (65) యిగ దానికి అప్పటికిప్పటికీ తేడా అదే విల్లు విద్యార్థుల్లో (66) అయ్నా మంచివాళ్లేరనిగాదు యిప్పటిగ్గుడ రత్నాల్లాంటివాళ్ పిల్లలున్నారు (67) అదెప్పుడూ వుంటునే వుంటారు (68) కనప్పటికిప్పటి కొదిగ డిసప్లిన్ కొంత మరీ యీ సమచ్చరమ్నుంచి లాస్టి యర్నుంచి అయ్తే పిల్లవాన్లదుపులో లేరు (69)వాల్లనదుపులోక్ తీస్కరవాల్నంటె చాలాకాలమ్ పడ్తుందనేటవంటి అభిప్రాయమ్ వాకుంది (70) యిక్కడ మిడిల్స్కూ లైవంక వరంగల్ వెళ్ళవల్సొచ్చింది - కాలేజ్ యైట్ హైస్కూలక్కెణ్ణెవుంది (71) త్రియియ ర్బదివానడ (72) ఆ కార్ణంగ మేమేమ్ జేసేది బస్సుకు పొయ్యే పరిస్తితిగుడ లెదు (73) డబ్బు సర్ పడకపొయ్యేది (74) అ-కంట్రోలోకటుంది. (75) రేష్నింగోటమల్లో పెట్టారు (76) అయ్తె మెమిక్కణ్ణుంచి నలుగురమైదు గురమున్నవ్ - క్లాస్ మెట్స్ - మా బంధులవుగుడానెన్నవ్ (77) ఇప్పుడొకాయేన్ తెహిల్ దార్ గావున్నాడు (78) ఒకాయ్న లెక్చరర్ గ వున్నాడు (79) నేనూ టీచర్ గ.వున్నాను (80) ఒకాయ్న చనిపోయిండిప్పుడ్లేడు పాపమ్-ఆయ్న పిల్ల్లిద్ద న్నరు (81) తేమే మిక్కణ్ణుండి.కుంచడు.బియ్యమూ మాకూ అవ్సరముండే చిల్లర సామానూ అంత నెత్తిలో బెట్కోని మూడెలు గట్కోని నలుగురం ఇక్కణ్ణుంచి

అయ్‌దుమైల్లుప్పలక్ నడ్‌చి పొయ్యేది సాయంకాలమ్ చీకట్‌నగ బయల్దెరి (82) పదిగంట్లాప్రాంతమ్ అక్కడ ట్రేనెక్కి యెల్లాపుర్ స్టేషను నెక్ట్స్ స్టేషనది అక్కడ దిగి అక్కడున్నండి తారిరోడ్డు విడ్చిపెట్టి పోలీస్‌వాళ బయము - రేవ్ నింగు బియమూ తీస్కపోయే రహా లేదసలక్కడ-అకోపనుగుడ కొదిగ యివలేదు పిల్లల కెవరిచ్చేవాళు (83) వందల వేలమందిక్ క్యూల నించుండేదాయ్ (84) మెమ్ స్కూలిడ్చిపెట్టి నిల్చొలెమ్ యిసుహిది విద్ - తప్పనిసరిగయ్‌దన్న మాట - మాకు-తిండిలెందాబత్కలెము-మానవ్‌డికి సహ్‌జమేకద (85) అయితే యెల్లా పుర్‌లొదిగి అక్కణ్ణుండనమ్ కొండక్ నడ్చిపొయ్యేది (86) సెవన్ ఎయిట్ మైల్స్ (87) తెల్లారేసర్ కిక్కడ్ జేరెది (88) పదియేనిర్ బైరోల సామాను మెతిస్క పోయేదదై పోయ్‌నంక మళ్ళి తిరిగి నడ్సొచ్చేది. (89) యీ పరిస్తితులో పోతు చద్‌వ్‌తూ కుడాను మెమ్ ఫేలవ్‌డమనేది మాక్ తెలియ్‌దు (90) స్పెషల్ నాకై తె నాక్ ఫేలనే సమస్సె వర్దు నా లైఫ్‌లో చదువ్‌లోలెదు (91) అదీ స్కులైఫ్ (92) స్కూల్లో ఏటెంత్ వరకే చదివ్ పాసైను (93) తదుపరీ యీ వుద్యోగ వుద్యోగంలొ చెరాను (94) చేర్నాక యింటమీట్ ప్రైవేట్‌గ తీశ్న వొకే అంటెంట్లో తదుపరి యింటర్మీడేట్ ట్రైనింగయాను - కాలెజిలో - నా హైద్రా బాద్‌లో అయ్‌తె ట్రైన్డ్ టీచర్స్ ట్రైనింగ్ కాలెజినుండె (95) ఆ తదుపరి బియ్యే ప్రైవేట్‌గ తీశాను ఒకే అటెమ్‌టులో (96) బియీడీ వరంగల్ కాలెజీలో చేశాను (97) ఆ తద్‌పరిప్పుడు యీ యూనివర్సిటీ యెమ్మేకు ప్రీవియసియరు కట్టేను (98) - పుడు నాకు నా తమ్ముడ్క తెడ చూడండి (99) నేను చదుకోని వుద్యోగంలొకొచ్చి నాక వాడు పెద్దవాడయ్యాడు (100) వాడు ప్రేవెట్‌గ యెందుక్ చద్‌వించాలె కాలేజ్‌ల చదిత్తామని వాడి వరంగల్లో చేర్చాను (101) టూ త్రి యర్సింటర్మిడెట్ తప్పేడు యిహ విస్కొచ్చింది - యిహ వాడ్ చద్‌వడమ్ చేతకాదనెటువంటి విష్‌యమ్ రుఢైపొయింది (102) అపుడెను డిప్‌టినిస్పెక్టర్‌గ వుంటిని (130) స్కేల్లోస్ మార్పొచ్చింది-అప్పుడు- ఫార్టిటూ టు ఫిఫ్టి ఫోర్ - ఫార్టిఫోర్ టు నైంటి అంటూ రెండు తీర్ల స్కేల్సు యిస్తుంద్రి (104) అప్పుడు వచ్చి డీవో నాకు పర్ చెయముంటార్ దగ -

సహ్‌జంగ - నే డిప్టిన్‌స్పెక్టర్నైతిని తమ్ముణ్ణి తిస్కపోయ్ ఫార్టిఫోర్ నైంటేల వేయించాను (105) అప్పుడు ఫార్టీటూలో వున్నవాళ్ళకి యిపుడు ఆర్తికంగా పద్‌రూపాల్ తక్కువ్ దొరుక్‌తున్నాయ్ (106) యిపుడు ఫార్టిఫైవ్ నైంటేల పాయింట్‌మెంటైన వాళకి పదిరుపాలెక్కువ దొరుక్‌తున్నాయ్ (107) యిప్పడికి వాడేపరీచ్చలు పైస్‌కాలేదు (108) వాడికి చదువనేది వాడికి ఒంటరాకుండా పోయింద్ (109) అంటే వుద్దేశమేంటంటె నేనప్పుడు బియ్యేమ్మోస్కపోయ్ కష్టపడి చద్‌వి ఫైల్ గాకుండా వుంటెనె అన్నితిగ్గ నేనివడమట్ నాన్నగారివ్వడమ్ యిద్దరివ్వడమాట డబల్ యింకమ్ వాడికి (110) యిట్లవుండి వరంగల్ల వుండి హోటల్లో తింటూ ఆస్టల్లోవుంటూ చదవ్ లేకపోయిండూ అంటే అది వారి వారి అద్రుష్టాలా మరేంటీ అది అది అది నాకు అర్ధంగాకుండా వుంది అంటె చదువ్ అందరికీ అబ్బదు అది (111) అది భగవదిష్టమే అయివుండాలేంటె నమ్మకమ్ నాక్కలిగింది (112) మా యిద్దరన్నదమ్ములయొక్క వ్యవ్‌హారమ్ చూస్తే (113) యిప్పుడు వాడైంటీటు వన్‌ఫ్టిఫ్టీస్కేల్లోన్ వున్నాడు మెట్రిక్ ట్రేన్డ్‌గ (114) ఇక్కడ యీ పియస్‌ల వుండె మొన్నటివరకు యిపుడూ సెన్‌గరమ్ విలేజ్‌కి ట్రాన్స్‌ఫరయింది హీజ్‌దేర్ (115) నాకూ యీ యెజుకెషన్ డిపార్టుమెంట్లో రకరకాల విధులు నా కనుభవ్మైంది (116) మొదట డబుల్ టీచర్ స్కూల్‌కు హెడ్‌మాస్టర్‌గ పొయ్యాను (117) ఆరమ్‌బంలోనే చిన్న యెడ్మాష్టర్ పని - సరే - ఎదో నేర్చ్‌కున్నాను (118) ఆ తదిపరీ అస్టెంట్‌గ చెరైనిక్కడ - యింటర్మిడెట్ ప్లేసైనంక - యీ స్కూల్లోనే పన్జెశాను (119) యింటర్మిడేట్ ట్రేనింగ్‌కు వేళ్ళొచ్‌నాక ఊ ... డీయ్‌వోగారుణ ఇన్స్పెక్షన్కొచ్చారు వారుకు వారు చూచి నన్డిప్టిన్స్పెక్టర్‌గ తీస్కున్నార్ సర్ (120) వార్తొనాగ్ మూడ్రోలికడ పర్చయెర్పడగానె వారికి నచ్చానెమొ మరి-వారికె తెలియాలైది (121) మొదలె యింటర్ ట్రేన్డ్గైన యింటర్ ట్రేనైవప్పటికిని నన్ను డిప్టిన్స్పెక్టర్గేశారు (122) యిగప్పట్నుండి ఆ తద్‌పరి బియ్యే తీశాను బియ్యేడ్ తీశాను (123) సెవనియర్స్ డిప్టిన్‌స్పెక్టర్‌గ పన్జెశాను (124) ఆ తద్‌పరిక్కడ్ కొచ్చానమాట నేన్ - అస్టెంటుగ - నేటివ్ ప్లేసని

అప్పుడు పెప్టిక్ అల్సరనీ డాక్టర్ అన్నాని స్తే యిడికొచ్చి కాస్త మందులు వాడాను - బాగై ంది (125) తదుపరి తిరిగి హెడ్మాష్టర్‌గ వేశారు (126) హెడ్మాష్టర్‌గ వేసి తదుపరి మళ్ళీ తదుపరి మళ్ళీ నొప్పివచ్చింది (127) మళ్ళీ యిక్కడ్కె వచ్చి యిక్కడ పన్చేస్తున్న - సైకెండియర్ నడ్‌స్తుందన్‌కోండి - అదేంటీ ఒక పూరల్ టీచర్ స్కూల్‌కు హెడ్మాష్టర్‌గ ఒక మిళ్ళి స్కూల్‌కు అస్టెంట్‌గ ఒక హెస్కూల్ అస్టెంట్‌గ ఒక హైస్కూల్ హెడ్మాష్టర్‌గా ఆ - డిప్టీన్‌స్పెక్టర్‌ఫ్ స్కూల్స్‌గా యెక్స్‌టెన్షనాఫీసర్ ఎజుకేషన్‌గా - బ్లాక్‌లల్లో యిన్ని తీర్ల పన్లు చేస్నాక అస్టెంట్ టీచర్‌గా ఉండేదే సుఖమన్పిస్తుంది (128) యెంద్‌కంటే పరిస్తితులు సరిగా లేవ్ (129) హెడ్మాష్టర్‌గావుంటే ప్రాబ్లమ్సు న్నాయనోక్కండి..."వీ హేవ్‌టుఫేస్ యాజె సీనియర్ టీచర్ ఐ హేవ్ టుఫేస్ అల్ దీస్తింగ్స్" (130) ఐనా యెందుకు మనం అటువంటి శ్రమ తీసోక్కవా లట్‌వంటవ్ ... ఆ ... ఆ వుద్ద్‌మిప్పుడే చాల మంది కక్కల్గ్‌తుంది (131) యీ వుద్దేశం చేత్నే జిల్లా పరిషద్దూడా అరేంజ్మెంట్ చెయ్‌డం చల కష్టంగా ఉంది (132) యిపుడు చేర్మాన్ గారున్నారన్‌కోండి (133) వార్ మరెవర్ని వెయాలెవర్ని వెయొద్దనె విషయం వార్కి మరిబ్బందులు వుండనే వున్నాయి - యి సెటవ్‌లో వుండేట్‌వంటివి (134) వాగ ట్రాన్స్‌ఫరైందీ అంటె నూటయాభై రెకమండేషన్లు తీసొక్కస్తారు మళ్ళీ అతనక్కడే వుండాలని (135) య్తే కారూ మేంటి పరిస్తితులా విదంగ అన్‌కూలంగ లేకపోవ్‌డం మూలాన - ఊ యిట్‌వంటి వత్తిళ్ళు జరుగుతున్నాయి (136) స్రైనట్‌వంటి సెలక్షని స్కూల్స్‌ని సీనీయర్ హేండ్స్ హెడ్మాష్టర్స్‌గ వోడమ్‌లేదు (137) సీనైర్ హైండ్సస్టెంట్స్‌గా ఉంటమంటున్నార్ (138) జూన్యర్స్‌నె యెడ్మాష్టర్స్‌గ వేస్తున్నారు (139) నేచురల్‌గా సీనియర్ జేస్‌నట్‌వంటి పని - అన్‌భవ్మున్నవాడ్ చేస్న పని అన్‌భవ్‌మ్ లేనివాళ్ళు అంతగా చెయ్‌లేరు (140) అంత సమర్థవంతంగా చెయ్‌లేరు (141) అది గుడ ఒక కార్ణమన్నమాట - స్కూల్లల్లో పిల్లల డిస్‌ప్లిన్ గ్గానివండి - విద్యగానివ్వండి - యీ కొదిగ తక్కువ స్థాయ్‌లో ఉండే (142) యిగెన్నో కార్నాలున్నాయి ఇటువంటే లెక్కలేనన్ని (143) తలిదండ్రులు -

తం|డుల తలిదం|డుల బాద్యత చలా వరకుంది (144) తలిదం|డుల్ని యీ విషయమ్ లోపల యే అడ్మిషన్సెప్పుడే యిద్ చేస్కుంటాము (145) తం|డిని తీస్కరామన్ పంపిస్తమ్ యెందుకంటె తం|డిగ్గుడ పిల్లవాణ్ణి అడ్మిట్ చేసేట్వంటి వుత్తేజమ్ వుల్లాస మిక్కడలేదు (146) యే కొద్దిమందొ వస్తారు (147) దరఖాస్తిచ్చి టీసిచ్చి వాణ్ణి పోరాఅంటె వాడే పోయ్ యిక్కడొచ్చి దర్ఖాస్తి స్తడు (148) అరె నాయ్న మి నాయ్న సంత్కం లేదేంరా బాబూ అంటె వాడె పాటుగబోయ్ ఒగ్గంట సేపటికి యెల్లయాన్ రాస్ కోన్ తీస్కొస్తడు – తం|డి సంతకమ్ (149) అయేతే అటొంటి పర్స్తిత్ లేకుండా మెమ్ సాధ్యైంత వరకు తన్రుల్ రావాల్నని ప్రయత్నమ్ చేస్తం (150) కాని వాళ్ళు రాలేర్ గుడ (151) యిపుడూ మూలమూల కుండేట్వంటి తం|డి వ్యవ్సామ్ చేస్తుండేవాడు కూలీ చేస్తుండేవాడు తన పనిడిచ్ పెట్కోన్ ఒగపూట యిక్కడ్కొస్తే ఆసాంకాలమ్ పిల్లలు పస్తు పండవల్సింది (152) అట్వంటి వాళ్ గుడ వున్నారు (153) య్తే అట్వంటి వాళను మెమడ్మిట్ గుడ చేస్కుంటమ్ (154) ఇగా దీనికి ముఖ్యకారణ మసలు యీ యెజుకేషన్ యెద్దైతే వుందో యీ జిల్లా పర్షత్తు నుంచి తీసి మల్లి డిపార్టుమెంటు కిస్తేనే యీ పిల్లాన్ల డిసిప్లిన్ బాగుపడ్తుందిగని లేగ్పొతె బాగుపడదని నమ్మకమ్ యిదెంతోమంది పెద్దపెదవాల్లుగుడ అంటునారది (155) దాన్ని సరే వుద్యోగిగా అనడమ్ అంత ధర్మంగా వుండదేమో మరి యధార్థ పరిస్తితి మాత్రమ్ అంతరాత్మను పరిశోధిస్తే లభించేది అదే నాక్ – నా అనుభవమ్‌లో అదొకటే మార్గమ్ (156) యిజిల్లా పరిషత్ లివి పంచాత్‌లు యెజుకేషన్ను పెంచలేవు పిల్లవాన్లను డిసిప్లిన్ బాగు చేయ్‌లెవెందుకంటె నాయకులే వాళను వాడ్కున్ని డైరెక్టా రిండైరెక్ట్ (157) వాళ్ళ ప్రభావమ్‌లో కొచ్చినాక నైచురల్లిగిక్కడ మేమ్ వొత్తిడి వేస్తే మాకెదుర్ తిరిగేట్ వంటవ్కాశమె వుంటుంద్‌గాని – అనిగే అవ్కాశముండదు (158) లేపొతె జెయ్యంటరుపుడ్జూస్తున్నమ్ అదీపరిస్తితి అందుచేత ఎన్నో కార్ణాలున్నాయి టీచర్సెగుడ కొంతవరకు కొందరు కొంతవరకు బాద్యత వున్నదన్‌కోండి (159) కని టీచర్సు పైన బాద్యత వెయ్‌డమ్ కుడ

అంత సమ్‌జసంగ వుండదు టీచర్ సరిగ రెగ్‌లర్గ క్లేస్ వెళ్‌నా తనపన్‌తన్ చేస్న ప్పట్‌కిని వాళ్ సరిగ యిస్కూల్‌కు రారు (160) వచ్చినా ఫస్ట్‌పిరిడైనాక వెళ్ళిపోడమే (161) పుస్తకాల్ సరిగ వుండవ్ ఒగ నోట్‌బుక్ తో రావ్‌డమే (162) ఆ కాపి యెక్‌డో పడేయ్‌డమ్ జైయని తిరగడమ్ వోటల్స్‌లో బోవ్‌డమ్ యిగ యీ సిన్మాలు యీ కథలఖ్‌ణాల్తోట్ డబ్బులూ మంచిగ యిస్తార్ తలి దంద్రి కడా - పలెలో (163) డబ్బులు బట్టోడమ్ కర్చుబెట్టడమ్ యింటికి తిరగడమ్ యీ నానా వేస్తలున్నయ్ (164) యిఖ్బా అందుచేత టీచర్సు బాధ్యులు బహుశా కారనే నా అబిప్రాయమ్ (165) యెంద్‌కంటె నేనూ టీచర్‌గ వుండి యెన్ని తీర్ల వుపాధ్యాయుడు పిల్లల్ని బాగ్ చెయ్‌డానికి ప్రయత్నమ్ జేస్‌నప్పటికిన్ని వాళ్ళు బాగుగాని పరిస్థితులే వాళ్ళకు అనుకూలంగా వుంటయ్‌గని "యెగబెట్టు మన్నాడ్ పెద్దకొడ్‌కు" సామెతుంది అందుచేత మంచి చెప్పేవాడు వాళ్ళ కసలు సరిగ నచ్చడు (166) అయ్‌నా టీచర్స్ మూలాన యియింత క్రమశిక్షణుందనె న నమ్మకమ్ (167)

యీ తాలూకాలో హైస్కూల్ వరకు విద్యాసద్‌పాయాల్ చాలా బాగున్నాయ్ (168) మా తాలూకాలో దాదాపు వందా ముప్పై గ్రామాలున్నాయ్ (168ఎ) ఆ ఇరవై రెండు ఇరవై మూడు హైస్కూల్సున్నాయ్ ('69) త్తె గౌర్నమెంటూ పద్ధత్ ప్రకారమైతే ప్రతిఅయ్‌దుమైళ్ళ రేడియస్ అయేర్యాలోపల ఒక్కై స్కూలుండాలని (170) యించుమించూ వున్నాయనె చెప్పొచ్చు వు తాలూకాల (171) మ జిల్లాలో వుండేట్‌వంటి తలూకాలల్లో యీ యీ తాలూకాకి స్కూల్సు యెక్వ సంఖ్యలో వున్నయనేట్‌వంటి విషయమ్ మాకు తెల్సు (172) కని కాలెజెజుకేషన్ కిక్కడ వస్‌తుల్ లెవ్ (173) రెండు లక్షల జనాభ వుండేట్‌వంటి యీ తాలూకాకి కనీసమ్ రెండుమూడ్ కాలేజీలైనా కనీసముండాలి (174) ఒకే ఒక కాలేజుంది అదీ ఒకే మూలల వుంది జమ్మికుంట కాలేజి (175) ఆపూర్ వాళ్ళా ప్రాంతం వాళీ కాలేజ్‌నుజురవాద్‌కు మార్చండీని ఒ పెద అలజడి ఆరంభించారు వాళు (176) ... (177) తె కాలేజి

ఎజికేషన్లొ ఇకడ మ తాలుక్వాల వసతుల్లేవు (178) వరంగల్ దగ్గరుంది గాబట్టి మకు జిల్లా కరింనగరై నప్పటికిన్ని హానమ్కొండ దగ్గరగా వుంటుంది (179) అందుచేత మా చదువైన - మా పిల్లలూ అక్కడికి పోవ్డమే కాలేజ్కి పోతే - మా వ్యాపార మున్న అక్కడికే పోవ్డమ్ యితరవిష్యాలు దవ్ఖాన అయ్నగాని యంజి యమ్ కె పొతంగాని కరింనగ్గర్ హాస్పిటల్కి పోమ్ (180) త్యొ మకు వరంగ ల్తొదగ్గర్సంబందమ్ (181) మా విద్యావ్సరాల్ని తీర్చేది వరంగల్లెకని యీ తాలూకాలో వుండె తాలూకా లేవీ కావు (182) జూనియర్ కాలేజ్గ చేసున్ - ప్రయత్నమ్ చేస్తున్నరు దాన్కీ గౌర్న్మెంట్ కొంతా కంట్రిబ్యూషన్ డొనేషనున్న కొంత లేండడిగేరు అయ్తే మేమే కాస్త యీ వురి వాళ్ళం కొంత చొరవా తీసోక్ని యివురి పెద్దల్ని ప్రెస్డెంట్గార్ని వాళ్ళని వీళ్ళని ఎజుప్రెజెంట్ కమెటివాళ్ళ కలిసి వారికి విషయమ్ తెలియ్జేశామ్ (183) డీయ్వోగారు రెండ్ మూడ్సార్లు వచ్చారు మీటింగ్స్ జరిగినాయ్ (184) వాళ్దె అర్ కలెక్టింగ్ డొనేషన్స్ (185) బవ్శా యీ సవ్వచ్చరమ్ వాళ్ళు తప్పకుండ ఇక్కడ్ జూన్ యర్ కాలెజ్ ఏర్పాటు చేస్తారనేట్వంటి నమ్మకమే మాకుంది (185) యింత వరక్ మాత్రమ్ అలాంటి ఆర్డర్ ఏవీ రాలేదు మాక్ మా వూర్న్ సెలెక్ట్...యీ వుజూరావాద్ని జూన్యర్ కాలేజ్ లిస్ట్లో వుంచినట్టుగా మాత్రమ్ మాకూ తెల్సు (186) ఒక్సారి యూనివర్సిటీ కమిషన్ కూడా యిక్కడె కొచ్చి పొయిందు(187) వల్లుగుడ మంచి ప్లేసిది - తాలూకెడ్ క్వాటరు యిది తాలూ కాకి యీ హెడ్ - హుజూరాబాద్ మద్యలో వుంది - యిక్కెడె కాలె జండ్ తప్పనిసరెన్టటువంటి అభిప్రాయమ్ వాళు వ్యక్త పర్చారు (188) మాయ్స్కూల్లొ గుడ సఫిసెంట్ రొయికామ దేశనుందిమక్ బిల్డిం గిపుడు కట్టాలనేమ్లెదు (189) యీ హైస్కూల్ బిల్డింగ్ లోనె వికెన్ రన్ అవర్ జూన్యర్ కాలెజ్ - యిఫ్ గౌర్న్మెంట్ శాంక్షన్స్ - అదీ పరిస్తితి - అద్ తక్వ సదుపాయమన్కొండి చదువ్కు - సదూపాయాల్లేవ్ (190)

మా తాతగారున్నపప్పుడు మాట్లాడేట్వంటీ భాషా యిప్పుడ్నెన్ మర్చ పొయ్నానొక్కండి మాతాతాన్ను మా నాన్నమ్మగారు మాట్లాడె బాషన్

(191) యెంద్కంటె చదువ్లో చేర్నప్పట్నుంచి వుర్దూ మిడియమ్ (192) సెకెండ్ స్టేండర్ట్ నుండి వుర్దు మిడియమ్ చదివైను యింటర్మిడియెట్ వరకు వుర్దు మిడియమే (193) య్తె ఆ తెలుగూ పైన యీ వుర్దూయొక్క ప్రబావ మొచ్చింది (194) అదీ అదీ కాకుండా యిక్కడా రాజ పరిపాలన వుండడమ్చేత వుర్దూ మీడియమప్ యిన్స్ట్రక్షన్ కాబట్టి వుర్దూ వాళ్ళయొక్క ప్రభావమెక్వగా వుండేది (195) కూలీనాలీ చేసేట్వంటి వాళ్ళుకుడ సాయ్బులిండ్లల్లో పెద్ద పెద్ద వాళ్ళిండ్లల్లో పన్చేస్తూ వాళ్ళుర్దే మాట్లాడే వాళ్ళు (196) య్తె సికింద్రాబాదూ ఏ విధంగా వుర్దూ ప్రభావ్నికి లోనై యిప్పుడిప్పుడు కుదుట పడ్తుందో తిరిగి తెలుగును మళ్ళీ తెచ్ పెట్కుంటుందో యిక్కడ గుడ అదే పరిస్థితుందన్ కోండి (197) హుజురావాదంటె యిది వుజూర్గారిరుపేరా వెల్సినట్వంటి గ్రామ్ - దీని మొదటి పేరు యెద్లాపురమని ఆ - అనంతారమనంతాపురమని అనంతారమని పెర్లుండెటివి (198) హుజురావాద్ నా చిన్నతనమ్ల అయిందీన్ విన్నా నెను హుజుర్వారు వుత్తర విచ్చట్ రాజ్గారు - అయ్తె యిప్పటికీ వుర్దూ ప్రభావమ్ ఆ భాషపైన వున్నది (199) మే ముర్దు మిడియంల చదివీ తెలుగూ స్కూల్లో బోదించాల్లంటే చాల కష్టపడవల్సొచ్చింది (200) తెలుగును మేము నేను చదువ్ కోవల్సొచ్చింది (201) చదువ్కొందే క్లాస్ లోక్ పొయ్యి పిల్లవాళ్ళతోని మాట్లాడ్డం చలకష్టంగ వుండేది (202) యెంద్కంటె వళ్ళు తెలుగు మిడియంతో వచ్చిన వాళ్ళైరి - నాచురల్గ వాళ్ళకి తెలుగు పదాలె వాళ్ళ బుర్రలో వుంటయ్ (203) యింట్లో మాతృభాషే నాయ్ (204) అయ్తే యీ మాట్లాడేటి యేదైతే వున్నదో ఒగ వ్యక్తితో మాట్లాడెప్పుడు ఒక తీర్గ వుంటుంది మాటా ఇంకొగ వ్యక్తితొ మాట్లాడేప్పుడు ఇంకో తీర్గ వుంటుంది (205) యెట్లాఅంటే నెనూ టూర్ వెళ్ళేప్పుడనుభోం చెప్తాను యింతవరకు టూ త్రీ యియర్స్ బ్యాక్ది (206) పల్లెకి వెళ్ళి వెనిన్స్పెక్షన్ చెసేప్పుడు హరిజన్ విద్యార్థి వుంటే నా భాష్లో మాట్లాడ్తే వాడికర్థం కాక పోయేది (207) వేరే విద్యార్ది బ్రాహ్మణ పిల్లాన్ననుకోండి అతడర్థం చేస్కునె వాడు (208) యిద్దర్లో తేడా వాళ్ళింటి నుంచొచ్చినట్వంటి భాషవే కాని

వేరేమీకాదు (209) బ్రాహ్మణ పిల్లడైతె బాపూ మీ నాన్నగారున్నారా యింట్లో అంట్ వున్నార్‌సారనేవాడు (210) యిద్ అరిజన పిల్లాడ్‌కైత్ అర్థమయ్యేద్‌కాద్ (211) అరె మినాయ్‌నున్నాడ్‌ర యింట్లో అంటే అయ్యా ఉండంచడు (212) అదీ తెడాన్నమాట చూడండి ఒకే భావాన్ని వెలిబుచ్చేందుకు ఒఖ బ్రామ్మణ పిల్లోడ్తో వేరుగ మాట్లడలి యిహార్‌జన పిల్లాడ్‌తో వేర్‌గ మాట్లడాలి - వంకరగ మాట్లడాలి - (213) యెప్పుడొత్తావ్‌ర నువ్ వత్తావ్‌ర మా యింటికి అంటె అత్త సారంటడు (214) కనివేరే పిల్లడట్లగాదు వాడింట్లో భాష సరిగ మాకు సరిగ కొన్ని సందర్భాల్లో పల్లెల్లో బ్రాహ్మలెవలైతె వున్నారో మాభాష కంటె మిన్నగ వుండేది (215) శ్రీ వైష్ణవులు బ్రామ్మలెవలైతె వుంటె వాళ్లిళ్లల్లో భాష వాళ్ళు స్వచ్ఛమైన్‌టువంటి తెలుగు మాట్లాడ్‌వచ్చేది (216) అదె వైష్ణవ భాషన్నమాట (217) వాల్ల దీర్ఘాలు వేర్‌గా వుంటాయ్ (218) అది తేడా అట్ల వుంటుందన్‌కోండి (219) ఒకటో తర్‌గతి రెండో తర్‌గతి పిల్లల్తో మాట్లాడైపుడు మళ్ళీ మార్‌పోతది (220) మీ నాయ్‌నగారున్నారంటె అ పిలాడికేం అర్దమైతది (221) మి నానున్నడాంటే కొందర్ కర్తమౌతుంది (222) నాన్న అనే పదం నాయ్‌న అనే ఎక్కువగా వాడ్తరు (223) మేము నాయ్‌నా అని పిలుస్తం (224) మా పిల్లలు నాన్నా అని పిలుస్తరు (225) నాయ్‌నని పిలువంటె వాళ్ళ కర్థమ్‌గాదు నాన్నంటెనె అర్దమైతది (226) యీా పాలు తాగ్‌తవా పాల్ తాతవా పాలూ అంటె అర్తమౌతది చా అంటె అర్థమౌతుంది కాఫీ అంటె అర్దమౌతుంది (227) ఇగా పడుకోడముందన్‌కోండి పిల్లవాడు బైటాంటడు వాడు పిల్లలు ఐతె మనమ్ [illegible] పడుకోంటె వాళ కర్థమ్‌గాదు. (228) నానా బైట వాంటె ఆ బైటా అని పడుకుంటడు (229) పడుకున్నాక కప్పుకోడము - కప్పన్న చల్‌పెడ్తుంటె కప్పన్నా గుడ్డాంట మనమ్ (230) తప్పా అంటరు వాళు (231) మామ్మాయి వుందనుకోండి - మామ్మాయి పల్‌క[illegible] వాళట్లాంటరు (232) అయ్తె వాల్ల బాష్‌లో మళ్ళి మనామ్ కప్పుకోడమనేది చలిపెడ్తుంటె మనమ్ బ్లేంకెట్ కప్పుకుంటమ్‌గద (233) అ కప్పుకోడమనేది వాళక్ కప్పన్నాంటె అర్ధమ్‌గాదు (234) వాళభాష తప్పా నాన

తప్పా అంటేనే వాళకు అర్ధమైతది (235) అంటే పిల్లవాళకూ ఒగ తీరిగ భాష మాట్లాడ వల్సివస్తది అదేవొక కల్చర్దూ వుండెట్ వంటింట్లోవుండె పిల్ల వాడ్తో ఒగతీరగ మాట్లాడాల్సొస్తుంది వేరే పిల్లోడ్ ఇంకొ తీర్ గ మాట్లాడాల్సొ స్తుంది (235ఎ) నువ్ చదువ్కున వాళతో మాట్లాడేటప్పుడూ అదీ వేరేగా వుంటుంది (236) ఇపుడింట్లో మాట్లాడే పదానికీ చద్ వెంచె మాట్లాడే పదానికీ తెడావుంది (237) ఒగాంధ్ర వ్యక్తితో మాట్లాడ్తుంటే అదనికి దగ్గరైగాబోయ్ అతని భాష అతని ధ్వనిలోనే ఆవే ఆవ్ టాక్ లోనే ఆ అధ్వని వస్తుంటుందన్న మాట కని అదే వొగరిజన్ తో మాట్లడేప్పుడు అతని మాటె అతను మాట్లాడ్తే అరెమల్లిగ ఎప్పుడొ స్తవేరనివ్ అ మంచమ్ గిట్టల్లెదున్నది మరీ మంచమల్తనంటె కదరమరి వత్తవ్ర అంటె అయ్యా అప్పటి కొత్తలె. రేపొత్త సనైర మొత్త సుక్రారమొత్త అంటడు (238) అదే మనమ్ ఎప్పుడు సనైరం సుక్రారం అనే మాట మనం వాడవ్ గద (239) ఆ పర్టికులర్ వ్యక్తితో మాట్లాడ్తమ్ ఎంద్ కంటె మనమ్ మాట్లాడెద దన్కి అర్ధంకావాలె (240) స్పెషలీ మైమ్ టీచర్స్ కాబట్టి మా వ్యూయే ముంటుంది మేమ్ చెప్పేది పిల్లల్ కర్ధంగావాలె మెమ్ మాట్లాడె దితర్ల కర్ధమ్ గావాలె (241) సావన్యంగ పెద్దవాళ్ళు అందరూ మాట్లాడె వాళ్ళదే మనం చెప్పేదితర్ల కర్ధమయ్ట్టుదే మాట్లాడ్ తరన్కొండి వుద్దేశమదే (242) కని టీచర్ కు మరీ సన్నియిత ముంటుంది నేను చెప్పేది యితన్కీ మాట్లాడె దితన్కి అర్ధం కావాలె యెదుటి వాడికి - అని (243) ఆ ధోరిణ్ లో పోతుందిగ - ఒక వ్యక్తి డిఫరౌతడు రోజుక్ పది తీర్లొక వ్యక్తి ఒక మాట్ నంటడు (244) అది ఆ పరిస్థితిల్ ను బట్టి (245) ఇగా ఫ్రెండ్స్ తో మాట్లడెప్పుడు ఆటోమైటిక్ గ యింగ్లిష్ ముక్కలు మధ్యలొ వచ్చి పడ్తయ్ (246) ముందు వుర్దు మాట్లొచ్చేది యిప్పుడు యింగ్లీష్ ముక్క లొస్తున్నయ్ (247) వుర్దూ మాట్లెట్లంటె సర్కార్ ఆరైనా కల్ కల్ మా య్న కర్తాయ్న స్కూల్ కు అనేది (248) రేభమయ్నా జేస్తడట ముహానా అనే దుర్దూపదం - ఇన్ఫెన్క్షన్ కు (249) వూ - మోహాన - అది వుర్దూపదం అత్తేమేవ్ వుర్దూ యిన్లుఫ్లు యెన్లస వుండేంజ్ సేది రేవ్ మొయ్నైతదీ రెపు మో

యిత్‌మీన్‌సాబొస్తాడ్ రా బాబూ మంచిగ సుబ్రంగా తయ్యారైన్ రండీనేది (250) మోత్‌మీన్ సాబూనె పదం జూడండి (251) మోత్‌మీన్ పుర్దూపదం (252) తెల్'ల వాడ్‌తమ్ మోత్‌మీన్ సాబ్ రెపొస్తడు మితయ్యారై రండి - తయారనెది పుర్దూ పదం (253) అస్తైె పుర్దు ప్రబావుందపుడు యిప్పుడట్ల అనము (254) యిప్పుడె నోటిసొసిచింది మీరు చూశార్‌గద. (255) మా యిన్స్పెక్షన్ - యిన్స్పెక్టర్‌గారొస్తున్నారు (256) మెపిల్లల్‌కెమ్ జెప్తమ్ బాబు యిన్స్పెక్షనుంది - యిన్స్పెక్టర్‌గరొస్తున్నారు - మిరు సరీగా చదువ్‌కొన్ రండీన్ చెప్తమ్ (257) చూడండీ మాయ్‌నాకూ - మోత్ మీన్ సాబొస్తాండు తయ్యారై రండిఅనే మాటకిన్ని యిన్స్పెక్టర్‌గారొస్తున్నారు యిన్స్పెక్షన్‌కు సిద్ధమైరండి అనేదానికిని యింగ్లీష్ ప్రబావ్‌ము అ యింగ్లీష్ పదాల్ కొన్ని తెలుగులో యిమిడి పోయ్‌నట్టుగా వస్తున్నయ్ (258) అంటె ఆ వ్యక్తుల్తో మాట్లాడెప్పుడు సావ్‌బ్ మాట్లడ్‌తె క్యావోరా మొలి సాబ్ అవ్‌కె స్కూల్‌మె అంటె కల్ హమారె మోత్మిన్ సాబ్ ఆరై మాయ్‌నా హోరా ఆంటడు (259) యింకో భాషనే మాట్లాడ్‌తమ్ - అంటె పదాల యొక్క ప్రబావమ్ తెల్‌గ్‌లో వుంది రేపు మోత్‌మీన్ సాబొస్తున్నరూ మోయ్‌నాకూ మిర్ తయ్యారై రండి అంటామ్ (260) మోత్‌మీన్ సాబూ మోయ్‌నాకూ తయ్యారై రండి-యీ మూడు పదాలుర్దు పదాలె (261) తెలుగులోనే మాట్లాడ్‌తున్నమరి- అంటె భాషయొక్క ప్రభావమ్ అ విషంగా వుంటదది (262) యిపుడు యింగ్లిష్ ప్రభావ్‌మమ్ అట్లావుంది (263) యితర ప్రాంతాల భాష అంటే అది . . . మంథినీ అవును చాలా...అక్కడ వాళు మనమ్ వస్తావరా అంటె - వాళు వస్సావ్ వస్సావ్‌రాంటరు (264) వస్సా అనేది అక్‌డ మంథెనవేయ్ కడపా బ్రామ్మలది (265) ఆయ్ అ ప్రాంతమ్‌ల వాళ్ళదే యిన్ఫ్లుయెన్స అన్నమాట (266) యేజాతి వాళ్లైనప్పటికిన్నీ వాళ్ళ భాషనె మాట్లాడ్‌తరు (267) యిపు డాంధ్రలో వుండేటువంటి వొక్క మొహమ్మదియ్‌డు అదే తెల్‌గు మాట్లాడ్ వట్టుగా యిక్కడుంటె మొహమ్మదియ్‌నికీ ఆంద్రులుండె మొమ్మదీయ్‌నికి భాష్‌లో సామ్యం పల్‌కులో లేదు (268) తెడా వుంది తెలుగ్ భాషా మాట్లాడ్

తున్నట్‌గనే వుంటుంది (269) అతన్ తెల్‌గులో మాట్లాడ్‌తుంటె అతన్ని మెమ్ సాయబన్ గుర్తించమ్ (270) గితను హరిజనూని సరీగ గుర్తించమ్ (271) కనిక్కడ మెసులువ్‌గ ఒగరిజను ఒగ బ్రాహ్మడు ఒక సాయబూని మాటల్ సులువ్‌గా గుర్తిస్తమ్ తెల్‌గు మాట్లాడ్‌తె (272) యేతే యే జాతికి చెందిన వాడవ్‌ని (273) ఆ ... యిప్పటికీ యిక్కడా యిక్కడికక్కడికి తేడా అదె (274) అక్కడ్ నుంచొచ్చే వాళమ్మేమ్ మొదలె గుర్తించమ్ - సాయబా తెల్‌గు వాడామ్ కాదాని (275) అంటే భాష్‌లో సామ్యముంటుంది వాళ్ మాట్లాడ్‌తె - కనిక్కడా అసామ్యముండదు - యిక్కడ విడివిడి సవ్‌రేట్ వాటర్ టేట్ కంపార్ట్‌మెంట్సన్‌కోండెవరివాళవె (276) అక్కడిక్ మనకు వాళక్ ... వాళ్ గుర్తిస్తార్ గావచ్చును మేము సరీగ గుర్తించము (277)

**లఘువ్యాఖ్య :**

**విషయం : విద్యారంగంలో వివిధహోదాల్లో తన అనుభవాలు**

సంస్కృతపదాల ఉచ్చారణలో ఒకసారి మహాప్రాణధ్వనిని పాటించడం, ఇంకోసారి పాటించకపోవడం ఈయనలో విశేషంగా చూస్తాం. ఉదా॥ సంక్య/సంఖ్య, బాద్యత/బాధ్యులు, బయం/భయం, ఆర్తికస్థితి. థకారోచ్చారణ ఈయన భాషలోఇంకో వ్యవహార పరిణామాన్ని సూచిస్తుంది. అది కోస్తా వ్యవహారాను కరణం. ఇక్కడి భాషలో నిత్యవ్యవహారంలో థకారం మహాప్రాణత్వాన్ని కోల్పోయి తకారంగా ఉచ్చరించబడడం, శిష్టులను అనుకరించే ప్రయత్నంలో మహాప్రాణత్వాన్ని ప్రవేశపెట్టి తిరిగి థకారంగానే ఉచ్చరించడం చూస్తాం. అయితే ఈయన భాషలో దీనితోపాటు థకారం శ్వాసతను కోల్పోయి నాదతను స్వీకరించడం (ధకార, దకారాలుగా ఉచ్చరించబడడం) గమనించదగిన విశేషం. థకారోచ్చారణలో మహాప్రాణత్వాన్నే గాక, నాదతను ప్రవేశపెట్టడంకూడా శిష్టోచ్చారణగా గ్రహిస్తున్నట్లు తెలుస్తుంది. దీనితో ఈయన భాషలో స్థానిక ప్రమాణోచ్చారణ అయిన థకారం, కోస్తా ప్రమాణోచ్చారణ అయిన ధకారం, ఇవి పాటించని తకార, దకారోచ్చారణలు గల రూపాలు కూడా కనిపిస్తాయి. ఈ రకంగా ఈయన భాషలో థకారోచ్చారణలో ద్విముఖమైన వ్యవహార పరిణామం కనిపిస్తుంది. 1. మహాప్రాణత్వం 2. నాదత.

ఉదా॥ ఆర్దిక పరి_స్తితి, ఆర్ధింగ/కఆర్థికంగ, సమర్థవంతంగా, అర్ధం/అర్దం/అ_ర్తం. విద్యార్ధి/విద్యా ర్తులు. మహాప్రాణధ్వనిని శిష్టోచ్చారణగా గ్రహిస్తున్నా డనడానికి ఇంకో దృష్టాంతం ఆ ఉచ్చారణ తెలుగు సంఖ్యావాచకాలలోను, ఉర్దూ పదాల్లోను ప్రవేశపెట్టడం. ఉదా॥ ఇరభై, నలభై, పంథొంద్వందల్, యా_భై/యా_బై, దరఖాస్తు (దరక్వాస్త్), దవ్ఖాన (దవాక్వానా). ఉర్దూ పదాల్లో క్వ కారాన్ని కకారంగా ఉచ్చరించడంతోపాటు (క్వర్చ్ అనే ఉర్దూపదాన్ని కర్చు అని ఉచ్చరించడం) ఖకారంగా ఉచ్చరించడంలో అన్యభాషాధ్వనులస్థానే స్వభాషాధ్వనులను ప్రవేశపెట్టడంకూడా గమనించవచ్చు.

హకారోచ్చారణ పాటించడంతోపాటు లోపంకూడా ఈయన భాషలో చూడవచ్చు. ఉదా॥ బహుళ/బవుళ, హుజురాబాద్ / వుజ్ రాబాద్, ఆస్టల్లో (హాస్టల్లో). హకారం పదమధ్యంలో, పదాదిలో లోపించడంతోపాటు పరావైచ్చిన కంఠ్యాచ్చు ఉకారానికి ముందు వకారం చేరింది. ఫకారోచ్చారణ అన్యభాషా ప్రభావానికి లోనుకావడంకూడా ఈయనలో చూడవచ్చు. ఉదా॥ ఫలితం(ఫలితం). ళకారోచ్చారణ ద్విరు_క్త స్థానాల్లో పాటించడంతోపాటు వాటిని అద్విరు_క్తంగా ఉచ్చరించడంకూడా ఈయన భాషలో గమనించవచ్చు. ఉదా॥ మా వాళు (మా వాళ్ళు), వాళజీవితం (వాళ్ళజీవితం), పిల్లలకెవరిచ్చేవాళు (పిల్లల కెవరిచ్చే వాళ్ళు), చదువుకుందామనే వాళసంక్య (చదువుకుందామనే వాళ్ళసంఖ్య).

ఈయన భాషతో ఇక్కడి భూతకాలికప్రత్యయం 'ఇన'కు మారుగా కోస్తా వ్యవహారంలో ఉన్న ఏ వినిపించడం ఇంకో తీవ్రమైన వ్యవహారపరిణామానికి నిదర్శనం. ఉదా॥ చేరేను (చేరిన), చేర్చేను (చేర్చిన), పజ్జేశేను (పజ్జేసిన), తీశేను (తీసిన), వచ్చేనేమో (వచ్చినానేమో), ఒచ్చేను (ఒచ్చిన), అడిగేరు (అడిగిను), ఏశేను (ఏసిన). (కుండలీకరణాలలోవి కరీంనగర్ వ్యవహారంలోవి). ఈ వ్యవహారపరిణామ దశను తెలపడానికి కింది వ్యవహారభేదాలు ఉపకరిస్తాయి. వ_క్తపర్చారు; చదివ్‌పొయ్‌నారు/చేసిన్రు. మొదటిది కోస్తావ్యవహారంలోది కాగా, రెండోది కరీంనగర్‌లో శిష్టులలో కొంతమందిలో నిలచినరూపం. మూడోది నిత్య వ్యవహారంలో ఇక్కడి మాండలికంలో శిష్టుల్లోను, శిష్టేతరుల్లోను వినిపించే

రూపం. అర్తమౌతుంది/అర్ధమైతది/అర్తమౌతది (అర్థమౌతుంది)వంటి వ్యవహార భేదాలు ఈయన భాషను ఇంకా లోతుగా పరిశీలించాల్సిన ఆవశ్యకతను తెలుపుతాయి. (ఐతుంది - శిష్టుల వాడుక; ఐతది/ఔతది - శిష్టేతరులవాడుక. కరీంనగర్ శిష్టులభాషలో 'ఐతుంది' తద్ధర్మం అని 'ఔతది' భవిష్యత్కాలంమాత్రం అని కొన్ని ప్రయోగాలు తెలుపుతున్నాయి).

భూతకాలంలో అద్యతన అనద్యతన కాలభేదాలు ఈయన భాషలో కనిపిస్తాయి. ఉదా॥ "అపుడెను డిప్టినిస్పెక్టర్‌గ వుంటిని", "రెండుతీర్ల స్కేల్సు ఇస్తుంద్రి" - ఈ రెండు ప్రయోగాల్లోను కాలం "ఒకప్పుడు" అనే ధ్వనిస్తుంది.

**అన్యభాషా ప్రభావంగల వాక్యాలు :**

1. అన్నిడిపార్ట్ మెంట్సువైతేవున్నవో
2. వేషబాషలనండి వాళ జీవితంలో మార్పులెవైతె వస్తున్నవో
3. యీస్ట్రైక్సు యిగొడవలూ యీ గందరగోళాలెవైతె వస్తున్నయో
4. యెజుకేషన్ యెదైతేవుందో
5. అయితే యీ మాట్లాడేటి యేదైతే వున్నదో.

## ఉ పా ధ్యా యు డు

కులం : **బ్రాహ్మణుడు** వయస్సు : **30** సం॥
ఊరు : **వేములవాడ** చదువు : **టి. యస్. యస్. సి.**

సాయంకాలం కాగ్గానే ఉపాధ్యేలు చాల వరకు ఇండ్లలగ్గాని కుంతమంది ఆడుకోడం గాని జరుగ్తది (1) ఆడ్‌కునె ఉపాధ్యేయ్‌లు మాత్రవ్ పిల్లవాళతో కలిసి బేట్‌మింటనో లేక వైగ్గాళికై ఎటన్న పోడమొ లెకుంటె సైరికేని కుంత మంది పోడవో జరుగ్తది (2) ఉపాధ్యేయ్‌లు ఇంట్‌కొచ్చి మాత్రవ్ పిలవాళకేం పాటాల్ జెప్పేరో మొట్టవోలు వళు విచారించ్‌కుంటారు (3) అడ్‌తర్ వాత

వాళ కార్యెక్రమవ్‌లో వ'ళు మునిగ్‌పోత'రు (4) ఇంట్లో సాధ్యమైయ్‌త్ మట్‌కు వ'ళు ఇంటి వైవ్‌హారాల్ జూస్‌కుంట్‌డం జరుగ్‌తది (5) లెగ్గుంటె యిత ... లెకుంటె యేంజె స్తరంటె వాళు ఇంట్లో ఇంకెవన ఏంజెయాలంటె సూస్‌కుడవ్ జరుగ్‌తదన'టు (6) క్లబ్‌లు ఈవుళో వెవ్‌లవాళో మాత్రవ్ లెవు (7) ఉపాధ్యేలు కుంతమంది ఆ డై అడవచ్‌గని చాలా అర్‌దు ఇకడై తే నెచూశ్‌నవాళొవ్‌ట ఎవ్‌డు కన్‌పివరు (8) ఆడ్‌తారన్‌కొండి ప్రత్‌దేదో జరుతుంటది కని మాత్రంగ్గ్ కన్‌పించద్దది బయటిగ్గన్‌పింజద్ది (9) ఇంక పూర్లో ఏక్ట్‌విటిసెవ్‌లెవండి (10) ప్రతైంగ జెప్పాలంటె ఇయ టీచర్స్‌యువో రాజ్జకియాలంటె ఇవ్‌డు ప్రపంచవ్‌లో జర్‌గే రాజ్జకియాలేవై తునయో దేసవ్‌లో జర్‌గె రాజ్జకియలెవెతునయో అ అన్నిగ్గుడ మొత్తమ్ టిచర్లొగ్గుడ అన్లై మిశ్‌తై మెయ్‌పొయునయ్ (11) వాళ్‌గ్గుడ వాటినిబట్టే ఇ రాజకియవాదుల్‌ని బట్టి వాల్ మెద్దుల్‌కుంటరు మొదుల్‌కుని వాళందాన్‌బట్టె చెస్తుంటరనటు (12) ముఖ్యంగ జెప్పాలంటె అసలు ఉపాధ్యేయ్‌లొపట ఇవ్‌డు వాలగ్గ్ ఉద్యోగ్గాల్ గ్గావలి లేకుంటె ఉద్యోగ్గాల్ ఇప్పించాలి లెకుంటె వాళకోజ్జ కెవ్‌ర్‌కొ ట్రాన్స్‌వర్ గ్గావాలె (13) ట్రాన్స్‌వర్ కావ'లంటె మరి ఎక్కడ్‌గ్ బొవాలె వ'ళు ? ఛఖ్యగ రాజ్జకియలొవాద్దల్ దగ్గర్‌కె పొవాలె (14) పొ'తే వాళు' ఎట్ల్‌ఉంటారంటే వళొగ్‌వేద' వాుందాగ్గ వెద్దయెదొ రాజులవలె మెదుల్‌కుంట్ ఉంటారనమాట (15)ఇయవిళుబయ్ వాళగ్గుగ్గొనైంబ్లై సె'వ్‌కున్‌లాగ పెయ్ దగ్గర్ నిల్‌చుండి చెయ్ రుద్ కొ'డమో లెకుంటె మొక్కమ్ చినబుచ్‌కొడవొ లెకుంట్ ఏడ్‌మొకమ్ లొత్ బెట్‌డమొ ఎదొవొటి ఉండి "ఇట్ల్‌అండి మ'కికంచెల్ యికడ్‌కైలి' ట్రాన్‌వర్ గ్గావాలె ఎంజెయాలె మీరె చెయాలె ఎద్దన్‌జెయండి" అంటె మరై చెట్ల్‌నయ ఇఇట్ల ట్రాన్స్‌వర్ జెయాలంటె ఎట్ల గుర్‌తదయ ఎకణోఒక్‌వేల్ పంజెయాల్‌గ్గద్‌నయ మిరట్లయ్‌చ్ ఇట్లాన్‌చెపివ'లు కొద్దిగ్గ దభ్భాయింవ్‌తొ మాట్లాడ్‌తరు (16) అవ్‌డు వ'ళు సరె యెవనజెయ్‌ండి మీరె చెయ్‌ండి మకిం గింక్ వేరె దికు లేదు ఎట్లజెయ్‌పొతెట్లాన్‌చెపి వి'ళు బతిలాడ్‌త'రు (17) బతీ లాడ్‌తే సరెమంచిద్ చు'ద్దాంపొ' మంచిది ఇంకె'ంది ఇంకైనివ్ జెవ్‌నవ్‌గదవయ్

